వందేమాతరం

# సారథ్య కాంతేస చరిత్ర

వెల 0-4-0

*Printed at the Desabhimani Press, Guntur.*

1908.

# సూరత్ కాంగ్రెసు చరిత్ర

## కాంగ్రెసధికారుల ప్రకటన.

ఇరువది రెండవ హిందూదేశీయ మహాసభ సూరతులో ఆహ్వాన సంఘమువారిచే నిర్మింపబడిన పందిలిలో డిసెంబరు 26 తేదిన 2న్నర గంటలకు గూడెను. అచ్చటకు 1600 మంది ప్రతినిధులు వచ్చియుండిరి. ఆహ్వాన సంఘాధ్యక్షుడు తమ ప్రారంభోపన్యాసమును ముగించినతోడనే దివాన్ బహదూర్ అంబాలాల్ సర్కారుగారిదివరకే ఆహ్వానసభవారిచే నెన్నుకొనబడిన డాక్టరు రాసవిహారీ ఘోషగారగ్రాసనాధిపత్యమువహించుటకు సూచించిరి. దివానుబహదూరుగారు డాక్టరుగారి నామ ముచ్చరించుట తోడనే పందిలిలో

"వలదు, వలదు" ను ధ్వనులు వినవచ్చెను, ఐనను కొంతసేపటికి ధ్వని తగ్గుటజూచి యగ్రాసనాధి పతిగారు సురేంద్రనాధ బానర్జీగారిని వయిసూచనను ఆమోదించ వలసినదిగా గోరిరి. బానర్జీగారు తమయుపన్యాస మందలి ప్రథమ వాక్యమును పూర్తీ చేయకపూర్వమే ప్రతినిధులలో గొందరు వీరిమాటలాడకుండ జేయవలయునను నుద్దేశ్యముతో గేకలువేయ ప్రారంభించిరి. ఆహ్వాన సంఘాధ్యక్షుడు నిశ్శబ్దముగా నుండుడని సభ్యుల నెంత వేడినను ఫలితము లేదయ్యెను. బానర్జీగారు తమయుపన్యాసమును బ్రారంభించి నప్పుడెల్ల గేకలు బలమగుచుండెను. దీనినిజూడ గొందరు సభను జరుగకుండ జేయవలయునను దురుద్దేశ్యముతో వచ్చినట్లు స్పష్టమగుచున్నది. ప్రతినిధుల నిశ్శబ్దముగా నుంచుట యశక్యమని తలచి యగ్రాసనాధి పతిగారు సభవారు వెంటనే కేకలుమానినగాని సభ నాపివేయవలసి వచ్చునని జెప్పిరి. వీరిప్రార్థన లన్ని

యు నిష్ఫల మగుటజూచి సభ నాటిసమునకు ఆపి
వేసిరి. మరునాడు మధ్యాహ్నము సభ మరల
గూడెను. ఘోషుగారు పందిలివద్దకు రాగనే స
భ్యులలో ననేకమంది క్రిందటిదినము జరిగినయల్లరికి
తమ యనంగీకారమును దెలియజేయుటకో యనున
ట్లు తమ యుత్సాహమును, సంతోషమును వెలి
బుచ్చు నాదములతో వారికాహ్వాన మొసంగిరి.
అగ్రాసనాధిపతిగారు యుత్సవముతో బందిలిని బ్రవే
శించుచుండగా బాలగంగాధరతిలకుగారి సంతకము
తోనున్న యొక యుత్తరమునుఆహ్వానసంఘాధ్యక్షు
డగు మాలవీగారిచేతికిచ్చిరి. అయ్యది యగ్రాసనా
ధిపతిగారి యెన్నికనుగూర్చి బానర్జీగారు ఆ
మోదించిన వెంటనే కాంగ్రెసును నాపుదల కొరకు
తిలకుగారు మార్పును సూచింప గోరుచున్నారను
సంగతిని తెలుపునదిగా నున్నది. మాలవీగా రా
సమయమున కాంగ్రెసు నాపివేయ వలయుననిసూ
చించుట, యక్రమమని తలచి ఆయుత్తరమును ని

లక్ష్యపెట్టిరి. మరల సభను ప్రారంభించి బా నర్జీగారి యుపన్యాసము కాగానే అలహాబాదు నుంచివచ్చిన పండిత మోతీలాల్ మెహ్రూగారిని పయి విషయమును బలపరచవలసినదిగా గోరిరి. తరువాత సభవారి యంగీకారమును తెలియపరచ వలసినదిగా గోరినప్పుడు అందులో కొద్దిమంది మా త్రము వలదు వలదను కేకలు వేసినను సభ్యులలో ననేకమంది ఘోషగారగ్రాస నాధిపత్యమునువహిం చుటకు దమయంగీకారమును దెలియబరచినందున ఘోషగారు తమ యుపన్యాసమును బ్రారంభించ గానే తిలకుగారు సభావేదిక పయి నెక్కి ఘోషగా రియెదుట నిలువబడెను. అగ్రాసనాధిపతి నెన్ను కొనుటలో దమరు కొంత ఉద్దుబాటు చేయవలసి యున్నదని యిదివరకే యుత్తరము పంపినందున తమ యభిప్రాయమును జెప్పుటకు శెలవివ్వ వలసి నదిగా గోరిరి. అప్పుడు మాలవీగారు తన చేతికిచ్చి న యుత్తరములో కాంగ్రెసును నిలుపుదల జేయు

టకు తమరు సూచించెదమని యున్నదిగాని అగ్రాసనాధిపతి నెన్నుకొను విషయములో నేమియు లేదనియు అగ్రాసనాధిపతిగారిని సభ్యులందరు క్రమముగ నెన్నుకొనిన తరువాత దానివిషయమై యిప్పుడు ఆటంకపరచుట తగదనియు నుడివిరి. తిలకుగారు ఘోషుగారివంక తిరిగి వారితో వాదించ ప్రారంభించిరి. ఘోషుగారు వారికప్పటి స్థితిగతులను జక్కగ బోధించి తిలకుగారి సవరణకు జోటులేదని చెప్పిరి. నేనుమీమాట వినుటలేదని తిలకుగారు తమపట్టును వదలకుండిరి. తిలకీయ పక్షమువారి కేకలవలన ఘోషుగారి యుపన్యాసమును పక్కనున్నవారుగూడ వినుటకు వీలులేక పోయెను, అగ్రాసనాధిపతిగారెంత ప్రాధేయించినను, తమను వేదికపయినుంచి గెంటినగాని కదలననియు తమ యభిప్రాయమును వినవలసిన దనియు తిలకుగారు పట్టుపట్టిరి. ఈమూర్ఖ పట్టును జూచి తిలకుగారిచర్య లక్రమమనియు వారు తమ

స్థలమునకు వచ్చికూర్చొన వలసినదనియు కేకలు వినవచ్చెను. తిలకుగారి యనుచరులు కొందరు లాటీలతో వాలంటీరులను త్రోసివయిచి పైకివచ్చుచుండిరి. ఇదంతయు జూచి సభ జరుగుటకు వీలు లేదని బాగుగ్రహించి యగ్రాసనాధిపతిగారు తిలకుగారిని తమస్థలమునకు పోవలసినదిగా మరల బ్రార్థించిరి. ఈప్రార్థన లన్నియు వ్యర్థమాయెను ఈసమయమున సభమధ్యనుండి విసరి వేయబడిన యొకపాదరక్ష మెహతాగారికిని,సురేంద్రనాథ బానర్జీగారికిని తగిలెను. కొందరు కుర్చీలు విసరసాగిరి, మరికొందరు లాటీల త్రిప్ప బ్రారంభించిరి. ఈసంగతు లన్నిటినిజూచి కొందరు తిలకుగారిని సభనుంచి గెంటివేయుటకు ననుజ్ఞ వేడిరి గాని యగ్రాసనాధిపతిగా రనుజ్ఞనీయలేదు. సభలో నల్లరి యాగనందున కాంగ్రెసుసభ నాపివేసిరి. పోలీసువారు ప్రతినిధులను పందిలినుంచి వెడల గొట్టిరి.

## దేశభక్తుల విజ్ఞాపనము.

కాంగ్రెసు నాధ్యక్షులచే బ్రచురింప బడిన విషయములో గొన్ని యసత్యములు కనుపెట్టి సందున జరిగినసంగతులను వివరముగను, న్యాయముగను దేశీయులందరికి తెలియజేయుటకు మేమీ విజ్ఞాపన బంపుచున్నాము.

గడచిన సంవత్సరము కలకత్తాలో కాంగ్రెసు జరిగినప్పుడు దేశభక్తులును, రాజభక్తులును తమకు స్వరాజ్యమే పరమావధి యనియును, స్వదేశి బహిష్కారము జాతీయవిద్యాతీర్మానములను జేసుకొనిరి. మెహతా మొదలుగాగల బొంబాయి రాజభక్తులు అప్పుడేమియును ననజాలక మరల తమ యభిప్రాయములను స్థిరపరచుటకు సమయము వేచియుండిరి. సూరతులో జరిగిన బొంబాయి రాజధాని సభయందు మెహతాగారు బహిష్కారము జాతీయ విద్యాతీర్మానములను త్రోసివయిచిరి. తరువాత కాంగ్రెసు నాగపూరునుంచి సూరతుకు

మాార్చినప్పుడు వారియుస్తాను సారముగ బ్రవర్తించుటకు బొంబాయి రాజభక్తులకు మంచి సమయము దొరికెను సూరతు ఆహ్వాన సంఘము వారు చాలమంది మెహతాగారి యనుచరులయియుండుటగూడ దటస్థించినది. కాంగ్రెసుకమిటీ ఘోస్లేగారి ప్రేరేపణ వలన (దేశీయులందరు లజపుతరాయిగారి నెన్నుకొనవలసినదిగా ఘోషించుచు న్నను) రసవిహార ఘోషుగారిని అగ్రాస నాధిపతిగా నేర్పరచెను. దేశీయు లీపనివలన దమకవమానము గలిగినట్లుగా దలచిరి. అనేకమందిలజపుతరాయిగారి పక్షమున దాము మానుకొనవలసినదిగా ఘోషుగారికి తంతివార్తల నంపిరి.

ఘోషుగారు దేశీయుల మొరల నాలకించలేదాయెను. లజపుత రాయిగారు తమఅగ్రాస నాధిపత్యము వహించమని ప్రచురము చేసిరి. దీనివలన బ్రజల కేమాత్రమును దృప్తి లేక పోయెను

ప్రభుత్వమువారి నిరంకుశ ప్రభుత్వమును ఖండించుటకు లజపుతరాయిగారినే నెన్నుకొన వలసినదిగా పట్టుపట్టియుండిరి. ఆహ్వాన సంఘమువారు కాంగ్రెసునకు చిత్తుతీర్మానము వ్రాయవలసినదిగా ఘోష్గారిని నియమించిరి. ఘోష్ గారుగాని యాహ్వాన సంఘమువారుగాని 26 డిశంబరు గురువారము 2న్నర గంటలవరకు ననగా సభప్రారంభింపక పూర్వమీతీర్మానముల నెవరికిని దెలియజేయలేదు. సభజరుగుటకు బదిదినము లపూర్వము, తీర్మానముల పేర్లను మాత్రము ప్రచురపరచియుండిరి. వీటిలో స్వరాజ్యము-బహిష్కారము. జాతీయ విద్యాతీర్మానములు లేవు. ఈకారణమువలన కలకత్తా కాంగ్రెసు తీర్మానములను బొంబాయివారు త్రోసివేతురను యనుమానము స్థిరపడెను. అనేక వార్తాపత్రికలిట్టుల వదలివేయుట తగదని వ్రాసెను. 23న తేదీ వుదయమున తిలకుగారు సూరతుకువచ్చి యొక గొప్పసభ జేసి

ఆహ్వానసంఘమువారు జేసిన నక్రమమును వెల్లడిజేసిరి. కలకత్తా కాంగ్రెసు తీర్మానముల నయినను సూరతు కాంగ్రెసులో నుంచుటకు దేశభక్తుల సహాయము జేయుమని సూరతు పురవాసుల ప్రార్థించిరి. మరునాడు అరవిందఘోషుగారి యధ్యగ్రాసనాధిపత్యము క్రింద సూరతులో దేశభక్తుల సభ జరిగెను. ఆసభలో కలకత్తా కాంగ్రెసు తీర్మానముల ద్రోసివేయకుండ సర్వవిధముల జేయవలసినదనియు అవసరమయినయెడ నగ్రాసనాధిపతిగారి నెన్నుకొనుటలోగూడ వ్యతిరేకించ వలసినదనియు తీర్మానించుకొనిరి.

ఈమధ్యను సూరతులో కలకత్తా కాంగ్రెసు తీర్మానములను త్రోసివేయుదురనువార్త యసత్యమని గంభిగారొక యుత్తరమును బ్రచురించిరి. గాని గొందరడిగినను తీర్మానములు మాత్ర మెవరికిని యందనియ్యలేదు. డిసెంబరు 25 తేది యుదయమున ఘూర్లెగారివే దయాంను చేయబడిన

కాంగ్రెసు నిర్మాణముల కాగితము తిలకుగారికిదొ
రికెను. అందులో కాంగ్రెసువారి పరమావధి
యిట్లునిర్ణయించబడియుండెను. "ఆంగ్లేయ ప్ర
భుత్వములోనున్న యితర వలసదేశములవారి స్వ
రాజ్యమువంటి స్వరాజ్యమును పొందుటయే దేశీ
యసభవారి పరమావధి ఆయుదయముననే తిలకుగా
రొక సభజేసి బొంబాయివారు కలకత్తా కాంగ్రెసు
తీర్మానములను త్రోసి వేయుటను సంశయమునకు
తమ హేతువులను జెప్పిరి. కాలనీల స్వరాజ్యపర
మావధి నొప్పుకొనని వారు కాంగ్రెసు సభ్యులుగ
నుండతగరని జెప్పుట దేశభక్తులను కాంగ్రెసు నుం
చి త్రోసి వేయుటకొరకె యైయున్నది. ఆహ్వాన
సంఘమువారు కలకత్తాతీర్మానమున నుంచెదమని
వాగ్దానము జేసిన యగ్రాసనాధిపతిగారి నన్నుకొ
నుటలెలా నభిప్రాయ భేదములుండవని నొక్కి చె
ప్పిరి. అదియునుగాక కలకత్తా తీర్మానములను
చపలసినదిగా ఘోషుగారికియొక యుత్తరమును

సభవారందరి సంతకములతో బంపవలసినదిగా తీర్మానమాయెను.

ఆరోజు యుదయమున దయచేసిన లజపుత రాయిగారు తిలకు కపర్డీగారలకును దర్శించి చర్చా విషయములన్నింటిని నేర్పాటుచేయుటకు దేశాభ్యక్తుల కమిటీనొకటి యేర్పరచెదమని తమయుద్దేశ్యమును తెలియపరచిరి. తిలకు కపర్దీగారలకంగీకారమొసంగినందున వీలయిన నీకమిటీ నేర్పాటు చేయుటకు ఘోషుగారిసద్దకు వెళ్ళిరి. ఆసాయంకాలమే యుభయపక్షములవారికిని సంధిజేయుటకు దేశభక్తుల సభయొకటి జరిగెను. కలకత్తా కాంగ్రెసు తీర్మానముల ప్రకారము తీర్మానము లీపరాలియముకూడ నుంచెదమని యాహ్వానసంఘమువారు స్పష్టముగ జెప్పకున్న దేశభక్తులు అగ్రాసనాధిపతియెన్నికవద్దనుంచియు నడ్డుపెట్టుటకు ప్రారంభింపవలయును. యొకసారి యేర్పడిన తీర్మానములను వెనుకత్రోయుటకు నెవరికిని యధికారము లేదు.

అరాత్రిగాని, మరునటి యుదయమునగాని తమ కే ర్పాటుజేయుదమనిన కమిటీ విషయమయి లజపతి రాయిగారు వర్తమాన మేమియు బంపలేదు- కాం గ్రెసులో జరుగబోవు తీర్మానములు తిలకు గారికి గాని కపర్డీగారికిగాని జేరలేదు

డిసెంబరు 26వ తేది యుదయమున తిలకు క పర్డీ అరవింద ఘోషుగార్లు బానర్జీగారి ఇం టికివెళ్ళి వారిని దర్శించిరి. అమృతబజారు పత్రి కాధి పతియయిన మోతీలాల్ ఘోషుగారు కూడ వారివెంటవెళ్ళిరి అక్కడ 1 వెనుకటితీర్మానము లను యేవిధముగను మార్చమని దేశభక్తులకు స్ప ష్టముగ వాగ్దానమును జేసిన యెడలను 2 దేశీయు లందరు లాలాజపతి రాయిగారిని ప్రథమమున నెన్నుకొనదలచినట్లుగా ప్రథమోపన్యాసకులలో నె వరయినను సూచించెదమని చెప్పినయెడలను ఘో షుగారి నెన్నుకొనుటలో దేశభక్తు లేవిధమయిన యభ్యంతరము పెట్టరని తిలకుగారు బానర్జీగా

రితో జెప్పిరి. తామే యగ్రాసనాధిపతి నన్ను
కొను తీర్మానము నామోదించ బోవుచున్నందు
న రెండవపరతును నొప్పుకొని ప్రధమ పరతు వి
షయమయి తనకేమియు నభ్యంతరము లేకపోయి
నను ఘోష్లెగారిని, మాలవీగారిని యడగ వలసిన
దిగా బానర్జీగారు జెప్పిరి. వెంటనే మాలవీగా
రిని బానర్జీగారియింటికి దీసుకుని రావలసినదిగా
బండినిచ్చి యొక వాలంటీరును బంపిరి. గాని సం
ధ్యావంద్యనుష్ఠానము జరుపుకొనుచున్నందున తాము
వచ్చుటకు వీలులేదని మాలవీగారు కబురుబంపిరి.
తిలకుగారు తరువాత మాలవీగారితో గలసి మాట్లా
డవలయునని చాలప్రయత్నించిరిగాని మాలవీ
గారిని కలుసుకొనుటకు సందర్భపడలేదు రెండు
న్నర గంటలకు మాలవీగారు ఘోషుగారి గుడార
మునందున్నట్లు కబురువచ్చినందున తిలకుగారక్క
డకువెళ్ళి తమతో మాట్లాడుటకు శెలవివ్వవలసిన
దిగా చీటీనిబంపిరి. అప్పుడు వీలులేదని తిరిగి వా
రు జవాబిచ్చిరి. దేశభక్తులందరును తిలకుగారి

ప్రయత్నముల ఫలితమును వినుట కెదురుచూచు చుండిరి. తుదకు వారి ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనము లయినవని ఖాపర్డేగారివలన వినిరి.

ఇంతవరకు 26 డిశెంబరు రెండున్నర గంటలకు అనగా కాంగ్రెసు ప్రారంభించు సమయమున నిరుపక్షములవారి స్థితిగతులు చదువరులకు బోధపడగలవు. సరిగా 2½ర గంటలకు సగ్రాసనాధిపతిగారును యింకననేక పెద్దలును కాంగ్రెసువేదిక పయి యథాస్థానముల నలంకరించిరి. ఇంతవరకును కాంగ్రెసులో జర్చింపబోవు తీర్మానముల విషయమయి తిలకుగారి కేమియు దెలియనందున తమ ప్రారంభోపన్యాసములో నగ్రాసనాధిపతి నెన్నుకొను చర్చవిషయమయి యేమియు సూచించవలదని సురేంద్రనాథ బానర్జీగారికి వారు వ్రాసిరి. తయారయియున్న యెడల జిత్తుతీర్మానములనొకదానిని పంపవలసినదిగా మాలవీగారికి తిలకుగారు వ్రాసిరి. 3 గంటలకు తిలకుగారి కొక ప్ర

తి వచ్చినది. ఈతీర్మానములే గడచినదినము అడ్వొకేటు ఆఫ్ ఇండియాయను పత్రికలో ప్రచురింప బడుటచూడ తిలకుగారికి మూడు గంటలపర్యంతము బంపకుండుట కేదేని యొకగొప్ప కారణముండి తీరవలయును.

ప్రథమదినము షుమారు 1300 ల ప్రతినిధులు వచ్చియుండిరి. అందులో 600 దేశభక్తులు గలరు. మాలవీగారి యుపన్యాసము కాగానే అంబాలాల్ సర్కారుగారు డాక్టరు రసవిహారీఘోషుగారు అగ్రాసనాధిపత్యమువహించు నట్లుసూచించిరి. ఈయన యుపన్యాసమున దుదవరకును నేమియు నల్లరిజరుగలేదు. తరువాత మాలవీగారు చెప్పు మాటలవలన నగ్రాసనాధిపతి నెన్నుకొనుటలో ప్రతినిధుల ప్రత్యేకాంగీకారమును తీసుకొనుట మానివేయుదురను భయముగలిగి సురేంద్రనాథు డుపన్యాసమిచ్చుటకు ప్రారంభించగానే పందిరియంతటను ,,వలదు వలద”ను కేకలు

ప్రారంభమయి పనిజరుగుటకే మాత్రమును నవ కాశము లేకపోయినందునసభ నాదినమునకునాపి వేయవలసి వచ్చినది. ఈయల్లరులకు నుత్తరవా దు లెవరో చదువరులే యూహించుకొనవలయును ఆసాయంకాలము దేశభక్తులొక సభజేసి కలకత్తా కాంగ్రెసు తీర్మానములనయిన నుంచుటకు యొప్పు కొనిన నగ్రాసనాధిపతి నెన్నుకొనుటలో నేవిధమ యిన యభ్యంతరము కలుగజేయ మనియు అటుల గాకున్న నగ్రాసనాధిపతి నెన్నుకొనుటలో గ్రమ మయిన తమ వ్యతిరేకాభిప్రాయమును దెలియ బ రచెదమనియు కాంగ్రెసు సభ్యతులతో నేర్పాటు జేయునట్లు గడచిన దినమేర్పాటు కాబడి దేశభక్తు ల కమిటీ కధికార మొసంగిరి. ఇదియునుగాక దే శభక్తులెవరును యేవిధమయిననల్లరి జేయగూడ ద నియు నుభయపక్షముల యుపన్యాసకులను సాంత ముగ వినవలసినదనియు దీర్మానముల జేసుకొనిరి ఆరాత్రి 8 గంటలకు చూనీలాల్ సరయూ అను

వారు తిలకుగారింటికివచ్చి వారు ఘోష్గారింటికి వచ్చిన నిరుపక్షముల వారికిని సంధికుదిర్చెద మని జెప్పిరి, రాత్రియేవేళ యయినను ఘోష్గారింటికి వచ్చెదమనితిలకుగారొప్పుకొని సందున చూనీలాల్గారు ఘోష్గారిని కనుగొని కబురంపెదమని జెప్పిరిగాని ఆరాత్రి ప్రత్యుత్తరమేమియు బంపలేదు

మరునాడుదయము 11 గంటలకు చూనీలాలుగారు తిలకుగారియొద్దకువచ్చి కపర్దెగారితో గూడ ప్రొఫెసర్ గజ్జరుగారి భవనమునకు రావలసినదిగా గోరిరి. అక్కడికి ఇంగ్లాండునుంచి వచ్చిన రుథర్ఫోర్డుగారు వచ్చెదరని జెప్పిరిగాని వారు కొన్ని సందర్భముల వలన నక్కడికిరాలేదు, గజ్జరుగారు మీరేమి జేయ నిశ్చయించుకొని నారనియడిగినప్పుడు తమ యభిప్రాయములను వివరముగ జెప్పిరి, సంధికుదరనియెడల నగ్రాసనాధిపతి నెన్నుకొను విషయము నాపివేయవలయును. ప్రతి రాజధానినుంచియు నిరుపక్షములవారి యధ్యక్షుల

ను నొకరొకరిని గాగలకమిటి నేర్పాటుజేసి యీ కమిటీ తీర్మానముల ప్రకారము సభ్యులందరు న డుచుకొనవలసిన దనియు తిలకుగారు జెప్పిరి. ఈ సంగతులన్నియు మెహతాగారికి తెలియపరచి ప ర్యవసానమును జెప్పెదమని వెళ్ళిరి. అరగంటలో మరలవచ్చి యటుల కమిటీ నేర్పరచుటకు వీలులే దనియు రెండుపక్షములవారు క్రమముగ ప్రవర్తిం చిన సభకు భంగమురాదనియు గజ్జరుగారును సర యూగారును తెలియజేసిరి. ఈవార్త వినగనే తిలకుగారు మాలవీగారికి

"అయ్యా!

అగ్రాసనాధిపతి నెన్నుకొను తీర్మానము ను నామోదించుటకైనతరువాత, ప్రతినిధులకు నే నొకయుపన్యాసమీయవలసియున్నది. ఈవిషయ మై తమయంగీకారమును తెలియజేయవలయును.

ఇట్లువిన్నవించు విధేయుడు.

బి. జి. తిలకు,

ప్రతినిధి (పునహా)"

అనివ్రాసిరి.

ఆరోజున సభయొంటిగంటకు ప్రారంభమై నప్పుడు అగ్రాసనాధిపతి నెన్నుకొనుతీర్మానమునామో దించవలసినదిగా కోరిరి. తిలకుగారు తమచీటికే మియు జవాబు రానందున కెల్కారుగారిని మరల వ్రాయవలసినదిగా గోరిరి. దీనికి జవాబు రాలేదు అందువలన తిలకుగారు సురేంద్రనాథుని యుపన్యా సము ముగియుట తోడనె కాంగ్రెసు వేదికపయి నె క్కబ్రయత్నించెను. అప్పుడొక వాలంటీయరు వారినాటంక పరిచినను వానినవతలికి నెట్టి వేదికపై నెక్కు-సమయమున ఘోషుగారు తమయధా స్థాన మాక్రమించుకొను చుండెను. కాంగ్రెసధ్యక్షుల విజ్ఞాపనలో తిలకుగారు అగ్రాసనాధిపతి ముందర నిలువబడిరనియు ఘోషుగా రగ్రాసనాధిపతిగనుం డుటకు ననేకమంది తమ యంగీకారమును తెలియ జేసిరనియు తిలకుగారు వేదికపయి నెక్కినప్పటికి ఘోషుగారు తమయుపన్యాసమును ప్రారంభించి ర ని యున్నది. ఈపయిసంగతులన్నియు నిజము

గా జరిగియున్నయెడల తిలకుగారి యుపన్యాసమును లేకుండ జేయవలయునను దురుద్దేశ్యముతో తాం దరగా స్వాగతాధ్యక్షగారిని కుర్చీలో కూర్చుండ బెట్టిరని తెలుచున్నది. కాంగ్రెసభ్యులకు నిజముగ క్రమముగ ప్రవర్తించవలయునని యున్న యెడల తిలకుగారి యభిప్రాయమును ప్రతినిధులందరకు దెలియజేసి వారియిష్టానుసారముగ బ్రవర్తించియుందురు. తిలకుగారు వేదికపయి నిలువబడగనె ఆహ్వాన సంఘమువారు తమ యయిష్టమును గనపరచిరి, కొందరు రాజభక్తుల అల్లరిజేయ ప్రారంభించిన నప్పుడు తమయభిప్రాయము జెప్పుటకు తమ హక్కుగలదనియు తమవాక్యములను నిశ్శబ్దముగ వినవలసినదనియు సభ్యులను ప్రార్థించిరి. ఈనిషయములో ఘోషుగారు జోక్యము కలగించుకొనుచున్నపుడు "తమరు క్రమముగ సభ్యులందరి చేతను ఎన్నుకొనబడలేదని తిలకుగారు చెప్పిరి. తిలకుగారు చేయునదంతయు అక్రమమని మాలవీ

గారునుడివిరి. ఈసందర్భమున బందిరిలో నొక
పెద్దకల్లోలము సంభవించెను. రాజభక్తులు తిల
కుగారిని కూర్చొనవలసినదిగా నరచుచుండిరి. దే
శభక్తులు తిలకుగారి యుపన్యాసమును సాంతముగ
వినవలయునని వేడుచుండిరి. ఘోషుగారును, మా
లవీగారును, తిలకుగారిని, వేదికపైనుండి గెంటివే
యవలసినదిగా నాజ్ఞయిచ్చినవిమ్మట నాహ్వానసం
ఘపు కార్యదర్శియైన నొకచిన్నవాడు, తిలకుగారి
ని పట్టుకొనెను. తిలకుగారు వానిని నెట్టివైచి, తమ
యుపన్యాసమును వినవలసినదిగా సభ్యులను మర
ల ప్రార్థించిరి. ఘోషుగారు తిలకుగారిని, గెంట
బ్రయత్నించిన చిన్నవానిని యిట్టుల చేయవలదని
గట్టిగ జెప్పిరి. కొందరు తిలకుగారికి కొంత యుప
కారము చేయవలయునని యత్నించిరి. తిలకుగా
రుసూత్రము, కదలక, మెదలక, తమహృదయము
నందు హస్తమునుంచుకొని నిలబడియుండెను. ఈ
గందరగోళము జరుగుచుండగా, ఒకచెప్పు గిరాటు

వేయబడెను- ఇది సురేంద్రనాథ బ్యానర్జీగారికిని మహాత్మాగారికిని దగిలెను. సభ్యులలో గొందరు కుర్చీలను విసరసాగిరి. ఇప్పుడు దేశభక్తులుకొందరు తిలకుగారికి యపాయముకలుగునని తలచి వారి సంరక్షణార్థమై వేదికనెక్కిరి- రెండుపర్యాయములు ఘోషుగారు తమయుపన్యాసమునుజదువవలయునని ప్రారంభించిరిగాని వీలులేకపోయెను. సూరతు ఆహ్వానసంఘమువారు తిలకీయపక్షమువారగు వాలంటీలరను తీసుకొనివచ్చి, క్రొత్తగ నల్లరిమూకను తెచ్చిపెట్టిరి- (Goondas) వీరు పందిరిలోని జరిగిన యల్లరికంతకును గారకులు. సభజరుగుటకెంతమాత్రమువీలులేక పోయినందున, సభనాపి వేసిరి. కాంగ్రెసభ్యులందరును వెళ్ళినతరువాత, ఆదివరకే వీరికోరిక ప్రకారం పంపబడిన పోలీసువారువచ్చి పందిరినుండి అందరిని వెడల గొట్టిరి. కొందరు దేశభక్తులు తిలకుగారిని సురక్షితముగ ప్రక్కనున్న గుడారమునకు తీసుకొనిపోయిరి- ఈరోజు సభప్రారం

భించకపూర్వము, తిలకుగారిని దూషించుచు గు
జరాతిభాషలో గొన్నిపత్రికలు పంచిపెట్టబడిన
వనిచెప్పుట యావసరముగాదు-

పైవిషయములను బాగుగనాలోచించిన
వారికి, తిలకుగారు వేదికపైకిరాకపూర్వమే ఘో
షుగారిని సభ్యులందరు యేకగ్రీవముగా సగ్రాస నా
ధిపతిగ నెన్నుకొనిన సంగతియు తిలకుగారు కాం
గ్రెసు నాపివేయుమని కోరినసంగతియు అసత్యమని
తెలియక మానదు. ఉభయపక్షములవారి యభి
ప్రాయ భేదములను సవరించుకొనుటకు నొకకమి
టి నేర్పరచవలసినదనియు అంతవరకును సగ్రాస
నాధిపతి నెన్నుకొను విషయమును నాపివేయ వల
సినదనియు తిలకుగారు కోరిరి. ఈప్రార్థన సరి
యైనను, కాకున్నను తిలకుగారు తమయభిప్రాయ
మును జెప్పుకొనుటకు హక్కుగలిగి యున్నారు,
ఈసంగతి బాగుగగు తెలిసియె మాలవీగారు సభా
ధ్యక్షుని నెన్నుకొనువిషయము తొందరగ పూతిఁ

జేయ నెత్తించిరి. సభలో జరిగిన యల్లరుల క న్నిటికిని మహాత్మా మొదలుగాగల కాంగ్రెసు సభ్యులే యుత్తరవాదులుగాని తిలకీయపక్షము వా రెంతమాత్రము జవాబుదారులుగారు.

డాక్టరు ఘోషుగారు తమ యుపన్యాసమును కాంగ్రెసు పందిలిలో చదువకపోయినను కలకత్తా వార్తా పత్రికలలో ప్రచురింపబడెను. కలకత్తా నుంచి వచ్చిన సగ్రాసనాధిపతిగారి యుపన్యాసము లో దేశభక్తుల దూషించినట్లు తెలియ వచ్చినది. ఈవార్త దేశభక్తులున్న బసలావా కొంత కలవర ము గలిగించినదిగాని యుభయపక్షములవారి యభి ప్రాయభేధములను సవరించుకొనుటకు నవకాశము లేక యుండలేదు. మో. తిలాల్ ఘోషు మొద లుగాగల పెద్దలుకొందరిరుపక్షములవారికిని సంధి జేసి మరుసటిదినము కాంగ్రెసు జరుగునట్లు చేయ వలయునను నుద్దేశ్యముతో తిలకుగా రింటికి వెళ్ళి యాయన యభిప్రాయముల నడిగిరి, తిలకుగా

రు తమయింటికి వచ్చినవారందరికి ప్రత్యేకముగా నొక్కొక్క యుత్తరము నీవిధముగా వ్రాసియిచ్చిరి

«సూరతు 28వ డిశంబరు 1907»

అయ్యా!

మనకు జరిగిన ప్రసంగవిషయమయి నేను తమకు వ్రాయునదేమన కాంగ్రెసధ్యక్షులు కల కత్తా తీర్మానముల నుంచెదమని చెప్పిన యెడలను ఘోషుగారి యుపన్యాసములో దేశభక్తులపయి సూచించబడిన నిందావాక్యములను వదలివేయుద మనిన యెడలను అగ్రాసనాధిపతి నెన్నుకొనుటలో మాకుండు యాక్షేపణను వదలుకొను చున్నాము.

బి. జి. తిలక్.

ఈయుత్తరమును వీరు కాంగ్రెసధ్యక్షులకు జూపిరిగాని వారు కాంగ్రెసును వెనకకు ద్రోయువ లయునని గట్టిపట్టుపట్టినందున సంధిమార్గము లే మియు కనుబడలేదు. మరునాడా పందిలిలోనే రాజభక్తుల సభజరిగెను. ఆసభలోనికి దేశభ

క్తుల నెవ్వరిని. రానివ్వలేదు, కలకత్తా కాంగ్రెసు తీర్మానముల ననుసరించి దేశ హితముకొరకు బని చేయ నిశ్చయించిన దేశభక్తుల సభ గూడజరిగెను, కాంగ్రెసుముందు యేవిధముగ జరుప వలసినదియు నేర్పాటు జేసిరి, హిందూదేశీయ మహాసభ యీవిధముగ తుదముట్టెను. ఏపక్షమువారి ప్రవర్తన యక్రమ మయినదియు జదువరులే గ్రహించెదరు గాక!

సూరతు 31 డిశంబరు 1907

బి- జి- తిలక్.
జి-యసు- కపర్ది-
అరవింద ఘోషు-
హెచ్. ముఖర్జీ-
బి- సి-చాటర్జీ.

చాటర్జీగారి యుత్తరము.

కాంగ్రెసు 27 వ తేదీ నాపివేయుబడిన తరువాత నుభయపక్షములవారికి సంధికుదర్చ వలయునని ప్రయత్నించిన చాటర్జీయనువారు వందేమా

తర పత్రికకు నీవిధమున వ్రాయుచున్నారు.

కాంగ్రెసునిరుకు లేకనే ఆపివేయబడిన 27 తేది సాయంకాలమునకు మరునాడు రాజభక్తుల సభయొకటి జరుగుననియు ప్రవేశద్వారమున నివ్వబడు విశ్వాస నిరూపపత్రికలపయి సంతకములు చేసినవారినే సభలోపలికి రానిత్తురనియు ప్రకటన జేయబడెను. కొంతసేపటికా సాయంకాలమే దేశ భక్తుల సభకు నేనువెళ్ళినప్పుడు కలకత్తా తీర్మానముల ననుసరించి కాంగ్రెసు జరుపనిచ్ఛగల ప్రతినిధులుగూడ నొకసభ జేయుదురని నేనువింటిని. తరువాత బెంగాలునుండివచ్చిన ప్రతినిధులవద్దకు వెళ్ళి వారితో నన్నివిషయములు చర్చించగా వారు నన్ను తిలకుగారివద్దకు వెళ్ళి అగ్రాసనాధిపతి నెన్ను కొను విషయములో తమపక్షమువారికుండు ఆక్షేపణను వదులుకొనుటకు వారిని ప్రార్థించవలసినదని చెప్పిరి. అట్లవారొప్పుకొనిన మరునాడు జరుపబోవు రాజభక్తులసభనాపివైచి కాంగ్రెసునే

మరల ప్రారంభించెదమని చెప్పిరి. అంతట నేనును నా స్నేహితు లోకరును తిలకుగారి వద్దకు వెళ్ళి మా సందేశము వారికి విన్నవించితిమి. అప్పుడు వారు కాంగ్రెసధికారులు కలకత్తా తీర్మానముల నుంచెద మని ప్రమాణము జేసిన యెడలను ఘోషుగారియు పన్యాసములో దేశభక్తులపయి నూదించబడిననిందా వాక్యములను వదలి వేయుదుమని వారు జెప్పిన యెడ లను తమ కే యాటంకమును కలిగించమని చెప్పిరి. నేను మరల బంగాళా ప్రతినిధులవద్దకువచ్చి తిలకు గారి షరతుల జెప్పి యెవరయినను సురేంద్రనాధ బానర్జీ గారికీవిషయములను తెలియ జేసి వారి య భిప్రాయమును తెలుసుకొన వలసినదిగా కోరితిని. అందరును దీనికి సమ్మతించినందున నయిదుగురము సురేంద్రనాథునిగారి యింటికి వెళ్ళి వారిసనిద్ర లేపి సంగతుల నన్నిటిని వివరముగ తెలియ జేసితిమి. వారితో రెండుగంటలు విషయములనన్నింటిని జ ర్చించిన తరువాత తిలకుగారు, నాపక్షము వారును

నేనును అగ్రాసనాధిపతి నెన్నుకొను విషయములో మాయాక్షేపణను వదలుకొనుచున్నాము. గడచిన రెండుదినములు జరిగిన సంగతులకు మేమువిచారపడుచున్నాము" అని సంధిపత్రము వ్రాయుటకు గోరునట్లు తీర్మానమేర్పడెను. దేశభక్తుల పయినుండు దూషణవాక్యములు తీసివేయుబడినట్లు తమకు బాగుగ తెలుసుననియు కలకత్తాతీర్మానముల నామోదించుటకు తమపక్షమువారందరును సిద్ధముగానున్నారనియు బానర్జీగారు చెప్పిరి. తెల్లవారగనే తిలకుగారి బసకువెళ్ళి యీసంగతులను నివేదించగా "తమ ఆక్షేపణను వదలుకొనెదమనియు కలకత్తా తీర్మానములు త్రోసివేయుబడినచో సభనుంచి తాములేచివచ్చెదమని జెప్పినఅన్నివిషయములలో బానర్జీగారి యభయమేచాలుననియు తిలకుగారు చెప్పిరి. ఇట్లుగాకున్న సురేంద్రనాథ బానర్జీ మొదలుగాగల యేడుగురు బెంగాలు ప్రతినిధులును తక్కిన ప్రతిరాష్ట్రమునుండియు నొక దే

శభక్తుడును ఒకరాజభక్తుడును గల ఒకకమిటీ నేర్పరచి దానిశాసనము ననుసరించి తమరందరు ను ప్రవర్తించెదమని గూడజెప్పిరి. తిలకుగారు సూచించిన నైదుగురు బంగాళా ప్రతినిధులలో ము గ్గురు రాజభక్తులయినందున యీకమిటీలో రాజ భక్తుల సంఖ్యయే యెక్కువగానున్నది,

మరల బానర్జీగారివద్దకు వెళ్ళి వారికీసంగ తులను మనవిచేసుకొనగా నాలుగు తీర్మానములు త్రోసివేయబడినను తమకు సభనుంచి వెళ్ళిపోవు టకు నంగీకరించమనిరి. 1905 సం॥ అగస్టు 7వ తేదిన విదేశవస్తువుల బహిష్కరించి జాతీయవిద్య నేర్చొల్పి స్వరాజ్యమును పొందెదమను తీర్మానము ల జేసికొని యప్పటినుంచియు తదేకదీక్షతో సమ స్త కష్టములకోర్చి పనిజేయుచుండిన బంగాళా వా రుయిప్పుడానాలుగుతీర్మానములనుత్రోసివయిచిసను సభయందుండుట తమ గౌరవమునకు లోపమని త లచి ప్రవర్తింతురని నమ్మియేతిలకుగారు బానర్జీ

గారికీ షరతు బెట్టిరి.

తరువాత తిలకుగారు ప్రస్తావించిన కమిటీ విషయమయి వారికందరికి జెప్పితిని. ఖానజీ గారున్ను యింకా యితరులును యీకమిటీ విషయమయి కాంగ్రె పక్షస్థులందరితో నాలోచించి పర్యవసానమును తెలియజేయుదమనిరి. వారు వెంటనేవెళ్ళి ఒకగంటలో తిరిగివచ్చిరి. ముజ్ఞి వారికి సోరాలాలుగార్లున్ను తిలకుగారిని పిలుచుకొని వచ్చుటకు వెళ్ళిరనియు వారు రాగనే కమిటీవిషయము యిపరిష్కరించెదమనియు జెప్పిరి. మరల ఒకగంటలో వారందరు కాంగ్రెసు క్యాంపుకు వెళ్ళిరి. కొంత సేపటికి నేనును వెళ్ళగా అక్కడ ఖారేలజపుతరాయుగార్లను కలసి వారికి తిలకుగారుజెప్పిన కమిటీ విషయమయి తెలియజేసితిని. వారు ఖానజీ చౌదరీగార్లతో వెళ్ళి కమిటీసంగతులు స్థిరపడువరకు ఆదినము జరుగబోవు రాజభక్తుల సభను ఒకగంటవరకు నాపవలసినదిగా అగ్రాసనాధిపతిగా

రితో జెప్పుటకు వేడితిని. బానర్జీ చౌదరీగార్లు వచ్చిన తమరు నాప్రార్థనకు సమ్మతించెదమనిసందున మేము బంగాళా ప్రతినిధులను వెనుకనారంభించి వారిని యగ్రాసనాధిపతిగారి గుడారములో కలసితిమి. అగ్రాసనాధిపతియొద్దకు వెంటనే వెళ్లి సభనాపివేయవలసినదిగా ప్రాధేయించుటకు వారిని నేను బ్రతిమాలితిని. కాని బానర్జీ గారును, చౌదరీగారును నిండుయాగ్రహముతో సంధి జేయవలయునను ప్రయత్నము నిష్ప్రయోజనమనియు తిలకుగారిప్పుడిక్కడకు రాకుండుటజూడ సంధి విషయమయి వారికేమాత్రము నిష్టము లేకుండుట స్పష్టమనియు పలికిరి. వెంటనే నేనుతిలకుగారిని పిలుచుటకువెళ్ళిన హరికిసోన్లాలుగారిని వారెందుకు రాలేదని యడుగగా వారిక్భోజనముకానందున రాలేదని జెప్పిరి. వారు నన్నుప్రక్కకు పిలిచి తిలకుగారిని సంధిషరతులను నాకుజూపిరి, రాత్రి

నాకు తిలకుగారు జెప్పిన షరతులకును వీటికిని యెంత మాత్రము భేదములేదు. ఇంకను తిలకుగారు జెప్పిన సంగతులనన్నిటిని వీరికి తెలియజెసి బానర్జీగారివద్దకువచ్చి రాజభక్తులసభ నాపుటకు సగ్రాసనాధిపతిగారిని ప్రార్ధించి కాంగ్రెసుపడిపోకుండ జూడవలసినదిగా వారిని వేడితిని. ఖారే లజపుతరాయిగార్లు కూడవచ్చెదరని జెప్పితిని కాని నాప్రయత్నమంతయు నిష్ఫలమాయెను బానర్జీగారు నన్ను ఘోష్ గారితో నన్నివిషయములను స్థిరపరచుకొనవలసినదని జెప్పిరి. ఘోష్గారి వద్దకు వెళ్ళగా సంధివిషయమయి మాటలాడుటలాభములేదని యొకమాటతో సరిపుచ్చజూచిరిగాని నేనుపట్టును వదలక వెంబడించగా నాకేమియు తెలియదనియు ఘోషుగారితో స్థిరపరచవలసినదనియు జెప్పిరి. నేనుపురల బెంగాలు ప్రతినిధులను సభనాపివేయు

టను ప్రార్థించవలసినదిగా మరలమరలయడుగగా నన్ను గ్రాసనాధిపతిగారి యొద్దకు తీసుకొనిపోయి నేను వారితో మాట్లాడుటకు వచ్చితినని చెప్పిరి. వారునాతో బాగుగ మాట్లాడిరిగాని సభనాపివేయుటకు వీలులేదనిరి. తిలకుగారు చెప్పినకమిటీ విషయము వారికి బాగుగబోధించితిని. భోజనము జేయుచున్న నుతిలకుగారిని వెంటనే తనువద్దకు తీసుకొనివచ్చెదనని చెప్పితిని. ఘోషుగారు నాప్రార్థనల నంగీకరించియే యున్న యెడల నుభయపక్షములవారి యభిప్రాయ భేదములు నశించి కాంగ్రెసు జయప్రదముగజరుగుటకు వీలుగలిగియుండు ననియే నానిశ్చితాభిప్రాయము. ఘోషుగారు సభనాపివేయుమనియు తనగడియారమును చూచి వేళయైనదని నన్నువదలి వెళ్ళిపోయిరి.

తిలకీయపక్షములవారి విజ్ఞాపనలో దనవిష

యమయి కొన్ని యసత్యము లున్నవని ఘోక్లెగారీ విధముగ వార్తాపత్రికలకు వ్రాసిరి.

సూరతులో సంభవించిన సంగతుల విషయము తిలకీయ పక్షమువారిచే ప్రచురింపబడిన విజ్ఞాపనలో ననేకమయిన అసత్యములున్నవి. అందులో గొన్ని నావిషయముగూడ నున్నందున వాటినన్నిటిని సవరణజేయుటకు నీప్రత్యుత్తరమును ప్రచురించుచున్నానుగాన క్షమించ వేడెదను.

### అగ్రాసనాధిపతి నెన్నుకొనుట.

1 దేశభక్తుల విజ్ఞాపనలో నీవిధముగనున్నది:- ఘోక్లెగారి ప్రేరేపణవలన సూరత్తు ఆహ్వానసంఘమువారు దేశీయులందరు లజపుతరాయిగారి నెన్నుకొనవలసినదిగా ఘోషించుచున్నను రాసవిహారి ఘోషుగారి నెన్నుకొనిరి." బేరారుతప్పతక్కిన రాష్ట్రములవారి యిష్టముమీదనే ఘోషుగా ర

గ్రాసనాధిపతిగ నెన్నుకొనబడిరి. సూరతు ఆహ్వా
న సంఘములెగా ననేకమంది గూడ ఘోషుగారి ప
క్షమున నే యుండిరి. లజపుత రాయిగారి నెన్ను
కొనకపోయిన యెడల నాగపూరు లోవలె పనిజరు
గకుండ తిలకీయపక్షమువారు జేయనిశ్చయించిరని
వింటిని గనుక నే నేను సూరతు ఆహ్వాన సంఘము
వారు అగ్రాసనాధిపతిగారి నెన్నుకొనుటకు జేసిన
సభకు వెళ్ళియుంటినిగాని యింకొక కారణము
లేదు. కాంగ్రెసు యేర్పాటుజేయుటకు సరిగా
ఒక నెలయైనను లేనందున యెవరెట్టి చిన్ని యూ
టంకము కలుగజేసినను సభజరుగుటకు వీలులేదు.
నేను కాంగ్రెసు జాయంటు జెనరల్ సెక్రెటరీనిగాన
కాంగ్రెసు జయప్రదముగ జరుపుటకు సూరతుకు వె
ళ్ళితిని. లజపుత రాయిగారిని నెన్నుకొనదలచిన
వారు కొందరు ఆహ్వానసంఘములో నున్నందున

వారిని నేను ప్రార్థించగా వారభిప్రాయ భేదము లు వదలుకోనెదమని సమ్మతించిరి. ఈసమ్మతి తిలకీయులు సూరతు జేరువరకు నిలచినదిగాని వారు రాగానే పరల కష్టములు సంభవించెను.

11 ప్రస్తుతము ప్రభుత్వము వారిని మనము తిరస్కరించలేము గనుకను అటుల జేసిన వారు మన యుద్యమ మొకనిముషములో భంగము జే యుదురు గనుకను లజపుత రాయిగారిని ఆగ్రాస నాధిపతిగా నెన్నుకొను ప్రస్తావమును ద్రోసివయ్యి గాతినని కొందరు నన్ను నిందించుచున్నారు. సంగతి సందర్భములను తెలుసుకొనజాలక కొందరు నావా క్యముల నంతగ దూషించుచున్నారు. 24 నవం బరు ఆహ్వాన సంఘమువారి సభ జరుగుటకుపూర్వ మిద్దరు దేశభక్తులతో బ్రస్తుత స్థితివిషయమయి చర్చించుచు నగ్రాసనాధిపతిగ నెన్నుకొనుటలో

లజపుతరాయిగారి పేరును తీసుకొనివచ్చుట తెలివితక్కువయని మూడు కారణములను జెప్పితిని.

1 యితర స్థలములలో జేయు ప్రయత్నములు సూరతువారు ఒక నెలలోనే జేయవలసి యున్నందున ఆహ్వాన సంఘములో నేమయిన కలత సంభవించిన కాంగ్రెసుపని జరుగుట కెంత మాత్రమును వీలులేదు.

2 సూరతు అహ్వాన సంఘములో నున్న రెండువందల మందిలో నయిదారుగురుతప్ప తక్కిన వారెవరికిని లజపుతరాయిగారి నెన్నుకొనుట యిష్టములేదు. అందువలనసభలో లజపుతరాయిగారి పేరు త్రోసివేయబడిన వారికి కష్టముగను చిన్నతనముగనునుండును,

3 లాలా లజపతిరాయిగారికి స్వాతంత్రయము తిరిగి యివ్వబడి యున్నప్పటికిని వారిని దేశ

భిన్నత్వము చేసిన దానియందలి ముఖ్యాంశమును
గూర్చియే యిక నను పోరాడవలసి యున్నది. అట్టి
పోరాటము దేశముయొక్క యుద్దేశ్య సమ్మేళనము
వారికి వెనుకందెగా నున్ననేగాని జరుగనేరదు-
కాంగ్రెసుయొక్క యొక భాగమువారు వారిని ఒక
పక్షము వారిప్రతినిధిగా నిలుప ప్రయత్నించిన సీ
యుద్దేశ్యము. విభాగము తప్పక యగుననుట
చూడవడియు, దుదియునుగా నున్నది. లజపత
రాయిగారిని గౌరవించుటకు నింకననేక మార్గ
ములు గలవని నేను సూచింతిని. ప్రభుత్వము వా
రిని తిరస్కరించుట నాయభిప్రాయముగాదు. అవ
సరమయిన యెడల ప్రభుత్వము వారి చర్యలను ను
నము ఖండించవచ్చును. ప్రభుత్వము వారి సహా
యము లేనిది మనమే పనిని జేయలేము. కాంగ్రె
సు పరమావధి విషయమయి ఒక చిన్నవానితో

చర్చించుచు చూడగా స్వరాజ్యమే గమ్యస్థాన మని యు ప్రజల హృదయములలో ప్రభుత్వమువారి యందు ద్వేషమును పుర్కొల్పవలయుననియు వారు వాదించిరి. ఈసందర్భములో ప్రభుత్వమువారి శక్తి తమకు తెలియదనియు వారు తలచుకొనిన యెడల మన యుద్యమము నొక నిముషములో భంగము జేయగలుగుదురనియు నేను చెప్పితిని. ఈప్రసంగ వాక్యములనే ప్రతిపక్షు లెంతో పెద్దజేసి నన్ను దూషించు చున్నారు.

III ..1907 సం॥ 24నవంబరు తేదినజరిగిన సభలో ఆహ్వాన సంఘమువారు కాంగ్రెసు తీర్మానములను చిత్తుగ్రాయ వలసినది గా ఘోషుగారి నియమించిరను మాట యసత్యము ఆదినము జరిగిన సభలో నాహ్వాన సంఘము వారివిషయమయి తీర్మానము జేసుకొనలేదు. డిసెంబరులో నేను బొంబాయికి వెళ్ళినప్పుడు కాంగ్రెసు తీర్మానముల

ను వ్రాయుటకు నాహ్వాన సంఘమువారు నన్నడు గుటకు నిశ్చయించుకొనిరని మానుభాయి నను భాయి అనువారు నాకు జెప్పిరి. నాకప్పుడు చాలా తొందర పనులున్నందువలన వారుగాని లేక గంధి గారుగాని ఆపని నెరవేర్చ వలసినదిగా జెప్పితిని-అయినను గంధిగారు తనకుతీరదని చెప్పినందున మానుభాయిగారే 34 యుద్యమమును ప్రారంభించిరి గాని వారికిని పనియెకుండ వయినందున 15 డిశంబరు నకు నే నేయూపని జేయవలసినదిగా జెప్పిరి.

IV "ఘోష్లేగారుగాని, ఆహ్వానసంఘమువారుగాని, 26 వ డిసెంబరు గురువారం 2న్నర గంటలవరకు కాంగ్రెసుతీర్మానముల కాగితముల నెవ్వరికి నందనివ్వలేదు." అనిరి. అచ్చు కాగితములు సిద్ధముగానుండకుండుటయే దీనికి కారణము. డిసెంబరు 5 వ తేదిన తీర్మానముల పేలనను సిద్ధముచేసితిని గాని వాటిని విపరముగ వ్రాయుటకు నాకువీలు

లేనందున, 19 వ తేదికి పునహః వెళ్ళితిని. తీర్మాన
ములను వ్రాయుటకు బహుకష్టమాయెను. అన్ని
టిలెరా మాలేకాగారి సంస్కరణల తీమానము
సరిగాకుండా 24 వ డిసెంబరుకు నేను సూరతుకు
వచ్చునప్పటికి నాపనిని తృప్తికరముగ జేయకక
పోతిని. ఇప్పటికిని సంస్కరణల తీమానము వ్రా
యలేదు. అయినను తక్కినవాటిని గంధిగారికిచ్చి
కాగితము లెరామధ్య కొంతస్థలముంచియచ్చువేయిం
చవలసినదిగా జెప్పితిని. సూరతులో ముద్రాశాల
లు సరియైనవి లేనందున వారచ్చువేసి యిచ్చునప్ప
టికి కొంచెమాలస్యమాయెను. నేను .2న్నరగంట
లకు కాంగ్రెసుపందిరికి వెళ్ళగా, అచ్చుకాగితములు
వచ్చినవని గంధిగారు నాకుజెప్పిరి. అప్పుడే తిలకు
గారు వీటికొరకు మాలవీగారికి ఖబురుపంపగా, వా
రికొకదానినిచ్చిరి.

ఇప్పుడు మనము మూడువిషయముల నా లోచించవలసియున్నది- 1 గడచిన కొన్ని సభల లో తీర్మానములను కాంగ్రెసు కొన్నిదినములకు పూర్వమే ప్రచురించుచున్నను, యెప్పుడును ఆవిష మున జరిగియుండలేదు-కలకత్తాలో దుడినిముష మువరకును తీర్మానములకాగితములను ప్రచు రము చేయలేదు. 2 యిదివరకెన్నడును చిత్తు తీర్మా నములకంత ప్రాముఖ్యత నెవరును నివ్వలేదు. ఈ తీర్మానములననుసరించి విషయవిచారణసంఘము వారు ప్రవర్తించ నవసరములేదు. ఇవికొంచెము సంఘమువారికి సహకారిగానుండును. ఏమార్పులను జేయక చిత్తునుబట్టియే తీర్మానముల జేసిన కాం గ్రెసు ఒకటియైనను లేదు. కాంగ్రెసుసభ్యులామో దించవలసిన తీర్మానములు స్థిరపరచు నధికార మాకమిటివారికేయున్నది. 3. ఇంతవరకేయాహ్వా నసంఘమువారును గడచిన కాంగ్రెసుతీర్మానముల

ను విషయవిచారణసంఘమువారి యాలోచనకుబె
ట్టుట యాచారముగానుండలేదు. కాలావసరముల
నుబట్టి మార్పులుచేయుచుందురు, సూరతు ఆహ్వా
నసంఘమువారును చేసినదిదియే. 5. "మాలవీగా
రు తమప్రారంభోపన్యాసమును జదువుచుండగా, తీ
ర్మానముల కాగితమొకటి తిలకుగారికి చేరెను.
ఈతీర్మానములు గడచినదినమే అడ్వకేటు ఆపు
యిండియాయను పత్రికలో ప్రచురింపబడుటజూడ
వారికి యొకదినము ముందరనె నీతీర్మానముల కా
గితము చేరినట్లు తేలుచున్నది." ఈపత్రికవారుము
ద్రాశాలనుంచి పత్రికలురాగనే గ్రంధిగారినుంచి
తీసుకుని బొంబాయికి తంతిద్వారా పంపియుండవ
చ్చును. లేకున్న, ముద్రాశాలనుంచియే తప్పుల
సవరణచేయుప్రతిని తీసుకుని పంపియుండవచ్చును.
నిశ్చయముగ 26 తేది కాంగ్రెసు పందిరివద్దకు వె
ళ్ళకపూర్వము అచ్చుకాగితములు రాలేదు. ఆయు

దయమున లజపుతరాయిగారికొకటి యివ్వవల
చితినిగాని దొరకలేదు.

ఇక నుత్తమార్గపముల విషయమై యాలో
చింతము-సూరతు కాంగ్రెసును వశగౌరవపరచుటకు
తిలకుగారు చేసిన ప్రయత్నములలో నిదిమూడవది.

1 నాగపూరునుంచి సూరతు కాంగ్రెసు
మార్చుటకు చేసిన ఇండియా కాంగ్రెసుకమిటి మీ
టింగుకుతమరు స్వయముగ వెళ్ళియుండినను తిల
కుగారు కమిటీవారిని దూషించప్రారంభించిరి.

2 ఈప్రయత్నము వ్యర్థమగుట చూచి, ల
జపుతరాయిగారిపక్షమున ఘోషుగారి నెన్నుకొను
ట మానివేయవలసినదిగా గ్రొత్తయాందోళన ప్రా
రంభించిరి. లజపుతరాయిగారి యుత్తర మీరెండవ
ప్రయత్నమునుగూడ భంగము గలుగించెను.

3 తరువాత, ఆహ్వానసంఘమువారు కలక
త్తా తీర్మానములను త్రోసివేయుదురను వదంతిని
దేశమంతటను వ్యాపింపజేసెను.

ఈవార్త వినగానే, దేశభక్తులు తమయా
గ్రహమును వెలిబుచ్చసాగిరి. డిసెంబరు 22వ తేది
న నేను బొంబాయికి వెళ్ళగా, అక్కడ ననేకమం
ది యాహ్వానసంఘమువారిని దూషించుట జూచితి
ని. ఆదినముననే, నేనులజపుతరాయిగారిని కలుసు
కొనినప్పుడు, వారుగూడ నన్నీవిషయమయి ప్ర
శ్నించిరి- చిత్తుతీర్మానములలో యించుక పదభేద
ముమాత్రము గలదనియు, వీటిని స్థిరపరచవలసిన
వారు విషయవిచారణసంఘమువారనియు జెప్పితిని
లజపుతరాయిగారు తిలకుగారికి యీసంగతులను
తెలియపరచిరి- ఐనను డిసెంబరు 21వ తేదిన సూ
రతులో జరిగిన దేశభక్తులసభలో, అహ్వానసంఘ
మువారు కలకత్తా తీర్మానములను తోసివేయ ని
శ్చయించినారని యాలోచనాభావ ధారణము
తో జెప్పిరి, ఇది సభలో గొప్పయుద్రేకమును క

లగించెను. కాంగ్రెసు కార్యదర్శియైన గంధిగారికీ సంగతి తెలసి, తీర్మానముల విషయమై తిలకుగారు చెప్పినదంతయు నసత్యమని ప్రచురముజేసిరి. 25 తేదిన లజపుతరాయిగారు దేశభక్తులబసవద్దకు వెళ్ళుచు తీర్మానములవిషయమై వారుఅనవసరముగ భయపడుచున్నారని నేను తిలకుగారితో జెప్పవచ్చునాయని నన్నడిగినప్పుడు, అటులచేయుట కేయభ్యంతరములేదని నేను జవాబిచ్చితిని. వారాసంగతిని స్పష్టముగ తిలకుగారికి తెలియజేసిరి. 11 గంటలకు బారిసాల్ నుంచివచ్చిన అశ్వినికుమార దత్తగారితో తీర్మానములవిషయమయి ముచ్చటించగా, వారు తమయంగీకారమును దెలియజేసిరి. మధ్యాహ్నము కాంగ్రెసుపందిరివద్దకు వెళ్ళగానె, తీర్మానములయచ్చుకాగితములు వచ్చినవనివింటిని. అప్పుడే యొకకాగితమును పుచ్చుకొని తిలకుగారికి పంపితిని. తిలకుగారది జూచుకొని, యీతీర్మానములలో గొన్నిపదములను గూర్చిన తమకే విధము

యిన యభ్యంతరములేదని మాలవ్యాగారితో చె
ప్పినటులవింటిని.

## తీర్మానములు.

### స్వరాజ్యము

దాదాభాయి నౌరోజీగారి యాధిపత్యము
క్రింద జరిగిన కలకత్తా కాంగ్రెసులో కాలనీల స్వ
రాజ్యమువంటి స్వరాజ్యము గమ్యస్థానమని తీర్మా
నించబడినటుల దేశభక్తుల విజ్ఞాపనలోనున్నది;
ఇదిసరికాదు. నౌరోజిగారు తమయుపన్యాసములో
స్వరాజ్యమనుపదము నుపయోగించినను, తీర్మా
నములలో యీపదము నుపయోగించలేదు. స్వ
రాజ్యము గమ్యస్థానమని కలకత్తా కాంగ్రెసువా
రు సూచించకయే, యీక్రిందివిధముగ స్వరాజ్యతీ
ర్మానమును జేసిరి, „స్వరాజ్యమనుభవించుచున్న
వలసదేశములవంటి స్వరాజ్యమును ప్రభుత్వమువా
రు హిందూదేశమునందు వ్యాపించునట్లు జేయవ

లయునని యభిప్రాయపడుచు, దానికనుగుణ్యముగ ప్రస్తుతప్రభుత్వపద్ధతులలో సంస్కరణ చేయవలయు నని యీసభవారు గోరుచున్నారు." సూరతుచిత్తు తీర్మానములను పరిశీలించి కలకత్తా తీర్మానము ననుసరించియే యున్నదని జెప్పనొప్పును. సూరతుతీర్మానము „ఆంగ్లేయపరిపాలనలో నున్న యితర రాష్ట్రములవారనుభవించుచున్న "స్వరాజ్యమువంటిస్వరాజ్యమును వారితో సమానమయిన స్వాతంత్ర్యములను, హక్కులను పొందుట కాంగ్రెసుపరమావధి" యీతీర్మానమును కలకత్తా తీర్మానమును పోల్చిచూచుచూ, స్వరాజ్యమనుభవించుచున్న వలస దేశములవంటి స్వరాజ్యమునకుమారుగా, యితర రాష్ట్రములవారనుభవించుచున్న స్వరాజ్యమను పదములను సూరతు ఆహ్వానసంఘమువారు చేర్చినందుకు తిలకుగారాక్షేపించుచున్నారు ఆంగ్లేయపరిపాలనలో కొన్ని దేశములవారు, స్వరాజ్యము లేక యేస్వాతంత్ర్యము ననుభవించుచున్నారని తిలకుగారు తమ యా

క్షేపణకు కారణముజూపుచున్నారు. యీయాక్షేపణ సరిగాకపోయినను, యెదినా చెవులబడగనే యితర రాష్ట్రములవారనుభవించుచున్న స్వరాజ్యమనుపదములను (స్వరాజ్యమనుభవించుచున్న వలస దేశములవంటి స్వరాజ్యమని మాచిఁతిని, నేను రాజకీయవిషయములలో పనిజేయుచున్నది మొదలు కాలనీలవంటి స్వరాజ్యమేమన పరమావధియని జెప్పుచుంటిని. 1905 వ సంవత్సరమున నేనుస్థాపించిన హిందూదేశ సేవకసంఘయుద్దేశ్యములను వ్రాయుచు, కాలనీలవంటి స్వరాజ్యమే మనపరమావధియని నేను స్పష్టముగ ప్రకటించియుంటిని. 1905వ సంవత్సరము కాశీలోజరిగిన కాంగ్రెసుసభాధిపతిగ యీవాక్యములనే నేను దృఢపరచియుంటిని. ఈవిషయముల నన్నిటిని గుర్తెఱిగిన తిలకుగారు స్వరాజ్యతీర్మానమును వెనుకత్రోయుటకు ప్రయత్నించితినని జెప్పుట కెటుల సాహసించెనో యాశ్చర్యముగానున్నది.

## స్వదేశి.

స్వదేశి తీర్మానవిషయమై యేవిధమైన మార్పునుచేయవలయునను నుద్దేశము లేదు. అయినను సూరతుఅహ్వానసంఘమువారిచే ప్రచురింపబడిన చిత్తులో కొన్నిపదములు పొరబాటున వదలివేయబడినవి. సూరతు తీర్మానములను చిత్తువ్రాయుసమయమునకు కలకత్తా కాంగ్రెసురిపోర్టు ప్రచురముకాలేదు. అందువలన, కలకత్తాతీర్మానములను ఒకవార్తాపత్రికలో చూడవలసివచ్చినది. ఈవార్తాబత్రికలో నున్నదియున్నటుల వ్రాయవలసినదిగా నేనొకరికి జెప్పితిని. వారటుల జేసిరి. యీతీర్మానములో వచ్చినపరలోపము మేము బుద్ధిపూర్వకముగ జేసినదిగాక యాపత్రికలోనున్న ప్రకారము వ్రాయుటవలనవచ్చినది.

## బహిష్కారము.

గడచినసంవత్సరమంతయు, దేశభక్తాగ్రేసరులు, కలకత్తాతీర్మానము నుసహాయము చేసుకొ

ని, గవర్నమెంటుతో మనకేవిధమయిన సంబంధము నుండగూడదని గొప్పయాందోళన చేసినందువలన, నీసంవత్సరమీతీర్మానములో గొన్ని మార్పులు చేయవలసివచ్చినది.

## జాతీయవిద్య.

ఈతీర్మానములో గొన్నిపదములు మార్చినను, దానియర్థము మారవలయునని మా యభిప్రాయముగాదు. దానియర్థముగూడ నెంత మాత్రమును మారలేదని యే జెప్పవచ్చును.

తిలకీయపక్షమువారు పైజెప్పిన నాలుగుతీర్మానములవిషయమై చేసిన యాందోళనమునకు దగుకారణము లేవియు లేవని దేశీయులందరకును దెలియగలదు. సూరతు ఆహ్వానసంఘమువారిని అవమానించుటకే వారిట్లుప్రవర్తించిరిగాని, ఇం కొకకారణము లేదు. దేశభక్తులు సంధిచేయవలయునని ప్రయత్నములుచేసినట్లు చెప్పుచున్నారు, లజపతిరాయి, సురేంద్రనాథబానర్జీ, చూనీలాల్ సరాయాగాలీర్ సంధివిషయమయి నాతో ప్రసంగించినట్లుగూడ ప్రతిపక్షులు ప్రకటనచేసిరి. ఐనను

యీముగ్గురిలో చూనీలాల్ గారిసందర్భములో నాతో నెన్నడును ముచ్చటించలేదు. డిసెంబరు 25 వ తేదీన నగ్రాసనాధిపతిగారి కాహ్వానమొసంగుటకు రైల్వేస్టేషనువద్దకు వెళ్ళినప్పుడు, లజపతరాయిగారు తిలకుగారు సూచించిన కమిటీవిషయమయి నాకు తెలియచేసిరి. అప్పుడు నేను జెప్పిన తీర్మానము ల సవరణచేయుటకు విషయవిచారణసంఘమువారికధికారముగలదు. ఇదివరకెన్నడును నీవిధముగ కమిటీ నేర్పాటుచేయలేదు, అదియునుగాక, తిలకుగారు తమపక్షమువారి భారమునంతయు వహించి పనిచేయుచున్నానుకొనవచ్చును. యీకలవరసమయములో మేమటుల చేయుటకు సమర్థులముగాము. లజపతరాయిగారు నావాక్యము లసత్యములను బాగుగ గ్రహించి, యీవిషయమయి మరలముచ్చటించలేదు, కాంగ్రెసుదినమున, పందిరివద్దకు వెళ్ళబోవుచుండగా, సురేంద్రనాధ బానర్జీగారు, కలకత్తా కాంగ్రెసు తీర్మానములను నీసంవత్సరము

గూడ తీర్మానించెదమని మనమిద్దరమును రూఢి గా జెప్పినయెడల అగ్రాసనాధిపతినెన్నుకొను విష యములో నేవిధమునైన యభ్యంతరములు గలుగ చేయమని తిలకుగారు సూచించినటుల నాకు జెప్పి రి. సభ్యులందరిపక్షమున మనమిద్దరమును యెటు ల ప్రాంచీ దారులముగా గలమని నేను మనవిచేయగా వారు నీయభిప్రాయము నంగీకరించిరి.

తిలకుగారు మూడుపర్యాయములు నాతో కలసి మాట్లాడదలచగా, నేనువారితో మాట్లాడు ట కవకాశము నివ్వలేదని ప్రకటనచేసిరి. ఇదెంత మాత్రమును సత్యముగాదు- తిలకుగారివిషయమై నా కెన్నడునువర్తమానముపంపలేదు. నేను న్న స్థలమునకు వారెన్నడును వచ్చియుండలేదని నేను గట్టిగ జెప్పగలను.

నాయుత్తరమును ముగించుటకుపూర్వము, రెండుసంగతులను చదువరులకు దెలియచేయగోరు చున్నాను. సూరతు ఆహ్వానసంఘమువారు, ప్రా

ర్వపు ఆచారములకు సేవిషయములెంతను భిన్న ముగ ప్రవర్తించలేదు, తిలకుగారు పురాతనాచారములను త్రోసివైచి నెమ్మదికి విరుద్ధముగ నడచిరని జెప్పనొప్పను. తమపక్షమువారందరును క్రొత్త బస నేర్పఱచుకొని సూరతుఆహ్వానసంఘమువారిపై లేనినిందలమోపి, ప్రజలకు వారిమీద ద్వేషముకలుగునట్లు దినదిన ముపన్యసించసాగిరి- తమ రేదిజెప్పినను దానినంగీకరించుటకు గొందరిని తమ పక్షము చేసుకొనిరి- ప్రథమదినమున వారియల్లరుల వలననె సభనాపివేయవలసివచ్చినది- రెండవదినమున తిలకుగారే యాటంకములు కలుగజేసి, సభ జరుగకుండ జేసిరి- ఆహ్వానసంఘమువారు కాంగ్రెసుచట్టముల విరోధించి, ఘోషుగారి నగ్రాసనాధిపతిగ నెన్నుకొనలేదు- కాంగ్రెసుకు సంభవించిన విపత్తున కాహ్వానసంఘమువా రెంతమాత్ర ముత్తరవాదులుగారు- తిలకుగారే యన్నియల్లరులకును గారకులు-

## వందేమాతరపత్రిక ప్రత్యుత్తరము.

ఘోష్‌గారు దేశీయులందరకు కాంగ్రెసువిషయమై సవిస్తరముగ దెలుపుటకు యొకయుత్తరమును ప్రకటించిరి. అందుజరిగిన సంగతులను జరిగినట్లు జెప్పకయే, దేశభక్తులను వారి యధ్యక్షుని నిందించిరి. జరిగినసంగతులను న్యాయముగను సత్యముగను వ్రాయుటకు పూనుకొనిరి. యీకారణము వలన మేము వారియుత్తరములోనుండు యసత్యములనుఖండించవలసివచ్చినది.

ఈసంవత్సరము సూరతు యూహ్వానసంఘమువారిచే బ్రకటించబడిన తీర్మానములకును, కలకత్తాతీర్మానములకును పదభేదముతప్ప యభిప్రాయభేదము లేదని వారుచెప్పుచున్నారు. మనము యీతీర్మానములను ప్రత్యేకముగా విచారించిచూతము, క్రిందటి సంవత్సరము బహిష్కార తీర్మానమీవిధముగనున్నది: బంగాళావిభాగమునకు వ్యతిరేకముగతమయభిప్రాయమును తెలియచే

యుట కేర్పరచినబహిష్కారోద్యమము న్యాయము
గనున్నది. సూరతుతీర్మానములో బంగాళావిభాగ
మునకు వ్యతిరేకముగ తమయభిప్రాయమును తెలి
యజేయుటకు యేర్పడిన విదేశవస్తువుల బహి
ష్కారము క్రమముగనున్నది 1905సం||అగస్టు 7 వ
తేది మొదలు బంగాళీలేమి జేయుచున్నారో కొంచె
మైనను తెలిసినవారెవరును యీరెండుతీర్మా
నములకును పదభేదమే యున్నదని చెప్పనోప్పరు-
విదేశవస్తువులను బహిష్కరించుటయే గాక, ఉభ
యపక్షములవారును తమభేదములను వదలి, చట్ట
నిర్మాణసభలను బహిష్కరించవలసినదిగా పట్టు
పట్టెను- డినాజపూరురాజాగారు తూర్పుబంగాళా చ
ట్టనిర్మాణసభలో సభ్యుడుగానుండుట కంగీకరిం
చినప్పుడు బంగాళీయనుపత్రికవారిని దూషించుట
యేగాక, సంఘమునుంచి వెలివేతుమనికూడ భయ
పెట్టెను- ఆసభలోనే రాజా శీతానాధరాయు
డుగారు జేరినప్పుడుకూడ తనయసంగీకారమును దె

లియ జేసెను, ఈదూషణలకర్థ మేమి? బంగాళీప
త్రిక యిటుదూషించుటకు చట్టనిర్మాణసభను
బహిష్కరించవలయునని యభిప్రాయపడుటవలన
నేగదా- తూర్పుబంగాళా ప్రభుత్వమువారితో యే
విధమయిన సంబంధమును కలుగజేసుకొనగూడదని
అనేకపర్యాయములు బంగాళీలకు జెప్పియున్నారు
రాజకీయవ్యవహారములలో పనిజేయుచున్న వా
రెవరును చట్టనిర్మాణసభలలో జేరుట కొప్పుకొన
లేదు- చట్టనిర్మాణసభలను. బహిష్కరించుట,
బంగాళావిభాగమునకు ఖండితముగా తమయభి
ప్రాయమును దెలియజేయుటకేర్పఱచిన బహి
ష్కారోద్యమ ఫలితమేయని ఘోష్లెగారు తెలు
సుకొనవలయును- యీయుద్యమములో, శాంత
పక్షులును, దేశభక్తులును కలసి పనిజేయుచున్నా
రు- తూర్పుబంగాళా చట్టనిర్మాణసభలను బహి
ష్కరించిన కారణముననే, పశ్చిమబంగాళములో
గూడ బహిష్కరించి తీరవలయును. ఈసభలలో

జేరువారందరును జనుల యిచ్ఛకు వ్యతిరేకముగ ప్రవర్తించుచున్నారని చెప్పవచ్చును. పశ్చిమబంగాళాయందును చట్టనిర్మాణసభలో ముగ్గురు రాజీనామాయిచ్చుటకు సిద్ధముగానున్నారు. ఇదియునుగాక, అంబికాచరణ మజుందారు, జోగేష్ చంద్ర చౌదరీ, భూపేంద్రనాథవసుగారలు తమయుద్యోగకాలమయినతరువాత మరల సభలో జేరుటకు ప్రయత్నించకుండుటజూడ రాజభక్తులును ఫరంగీ యుద్యోగములను బహిష్కరించవలయునను నిశ్చితాభిప్రాయముగలిగినట్లు తోచకమానదు. ఇకను దేశభక్తులన్ననో. ప్రభుత్వమువారితో సంపూర్ణ బహిష్కారవ్రతము బూనిరనుసంగతి ఘోరాక్లేగారు గ్రహించవలయును. తూర్పుబంగాళా లెఫ్టినెంటు గవర్నరుగారయిన ఫుల్లరుఘోరవారికి, పీరు వెళ్ళిన పట్టణములన్నిటిలోను తగు యాహ్వానమొసంగక బహిష్కరించినందుకు దేశీయులందరును యేకగ్రీవముగా తమయంగీకారమును దెలియజేసిరి. తూ

పూర్ణబంగాళాయందు ననేకమంది దేశాభిమాను లు ఆనరరి మేజిస్ట్రీటు యుద్యోగములకు రాజీనామాయిచ్చిరి. బుద్ధిపూర్వకముగ ప్రభుత్వమువారితో సంబంధము గలుగచేసుకొనకుండుట బహిష్కారోద్యమముయొక్క ముఖ్యోద్దేశ్యమయియున్నది. యీబహిష్కారోద్యమము, విదేశవస్తువులను బహిష్కరించుటయే యని చెప్పిన యంతయవివేకమును తెలియచేయునో మేమూహింపజాలకున్నాము. గాన సూరతు యాహ్వానసంఘమువారి బహిష్కారతీర్మానముకలకత్తాతీర్మానమునుంచి, పదభేద మేగాక, యర్థభేదము గలిగియున్నదని చదువరులూహించగలరు. డాక్టరు రాసవిహారీఘోషుగారుగూడ తమవ్యాసమునందు, సంపూర్ణబహిష్కారమునే యామోదించియున్నారు. కలకత్తాతీర్మానమేవిధమయిన సందేహార్థమునుగలిగియుండలేదు. బిపినచంద్రపాలుగారు బహిష్కారతీర్మానముయొక్క సంపూర్ణాభిప్రాయమును

సభవారికి దెలియచేసినప్పుడు, సభలో నెవరును త
మయసంతుష్టిని దెలియచేయలేదు. ఘోష్‌గారును
యీబహిష్కారతీర్మానమును సభవారు తమయి
చ్ఛవచ్చినట్లుగ యర్థము జేయవచ్చునని జెప్పిరి.
బిపిన్‌చంద్రుడు జెప్పినది తమరంగీకరించనియెడల
అప్పుడే ఘోష్‌గారు సభలో తమయభిప్రాయము
ను వెల్లడిజేసియుండవలసినది. అప్పుడటుల జేయుట
కు ధయిర్యము జాలక- తమపక్షము వారనేకులుండిర
ను విశ్వాసముతో సూరతులో తమయభిప్రాయము
ను ప్రకటన జేయుటకు బూనుకొనిరి- వాలుగారి స
మక్షమున ఖండించజాలక. వారిప్పుడు జనులలో
నున్న సమయమునందు వారినినిందించిరి- పరోక్ష
మందు యొకరినిదూషించుట కడుసోచనీయము.

స్వదేశీతీర్మానమునందు గలిగిన మార్పు
తాము బుద్ధిపూర్వకముగ జేయలేదనియు, ఇండియా
వార్తాపత్రిక ననుసరించి వ్రాయుటవలనగలిగిన
దనియు ఘోష్‌గారు జెప్పుచున్నారు- ఇదిసత్యమే

ఖైనను, తిలకీయపక్షమువారు సామాన్యమానవు లేగాన వారికి దివ్యదృష్టి లేకపోయినది. ఆకారణమున- చిత్తుతీర్మానములలో పదభేదముండుటగని ఆహ్వానసంఘమువారు మార్పును బుద్ధిపూర్వకముగ జేసిరని దేశభక్తులు యూహించిరి. ఘోష్గారు చివరకీకారణమును గనుపరచినందుకు దేశీయులందరును వారికికృతజ్ఞులై యుండవలయును- తిలకుగారి తీర్మానముల కాగితము నిచ్చినప్పుడే యీ కారణమును గనుపరచిన బాగుండియుండును

జాతీయవిద్యాతీర్మానమును పరిశీలించి చూచిన కలకత్తా తీర్మానములో దేశీయుల యవసరములను గనిపెట్టి దేశీయులయధికారముక్రిందనే పాఠశాలలు స్థాపింపవలయుననియున్నది- సూరతువారు ప్రచురించిన తీర్మానములో, దేశావసరముల కనుకూలముగ, స్వాతంత్ర్య పాఠశాలలను స్థాపించవలయుననియున్నది- ఈతీర్మానమును మనమంగీకరించిన ప్రస్తుతము మనదేశములో ధన

సహాయమును పొందకయే ప్రభుత్వమువారికి లొం
బడియున్న పాఠశాలలను జాతీయ పాఠశాలలని పి
లువవలసివచ్చును- ఈపాఠశాలలో గఱపబడు చ
దువంతయు ఫరంగీ చట్టములననుసరించియే యుం
డునుగనుకఁ దేశీయులకవసరమగు విద్యను గఱపు
టకు వీలులేదని తెలుసుకొనవలయును- గాన యీ
తీర్మానమునందు పదభేదమాత్రముగలదని
జెప్పుటయాశ్చర్యముగానున్నది-

స్వరాజ్యతీర్మానము:- దేశభక్తులకొక గొ
ప్పలాభమగుపడినది- గడచిన సంవత్సరపు తీ
ర్మానములానున్న ప్రజాపాలకముగల కాల
నీలవంటి ప్రభుత్వపద్ధతియనుదానికిమారుగా ఆం
గ్లేయపరిపాలనలోనున్న యితరదేశములవారనుభ
వించుచున్న రాజ్యపద్ధతియని చిత్తుతీర్మానము
లో యున్నది- ఈతీర్మానము, ప్రభుత్వమువా
రికోపమునకు పాత్రముగాకుండ నుండుటకు మా
ర్చబడిన పైమాదు తీర్మానముల సరసనున్నంత

వలన, యిదియును ఆయుద్దేశముతో పూనిరని తిలకీయు లభిప్రాయపడిరి- గోక్లేగారికి నిజముగ తమకేమరభిప్రాయమును లేకయుండియుండవచ్చును. దేశభక్తులు వారిమనస్సు కనుగొనలేనందుకు విచారపడవలసినదే.

గోక్లేగారు తమయుత్తరములో తిలకుగారిని వారిపక్షమువారిని యెక్కువగ నిందించిరి. సూరతు ఆహ్వానసంఘమువారు బహిష్కారము, స్వరాజ్యము, జాతీయవిద్యా తీర్మానములనువదలి వేసిరని తిలకుగారు దేశమునంతను యల్లకల్లోలము జేయుట యుచితముగాదని గోక్లేగారి యభిప్రాయము. గోక్లేగారి యుద్దేశ్య ప్రకారము సూరతువారు పయిజెప్పిన తీర్మానములను వదలివేయుట యుచితముగనున్నదిగాని, తిలకుగారు వాటిని దేశీయులకు తెలియజేయుట సరిగాదని వారి యభిప్రాయముగాబోలు. గోక్లేగారు, సూరతు తీర్మానములలో పదభేదముమాత్రము గలదని చెప్పినను

తిలకుగారు వారిమాటల యసత్యమును బాగుగ గ్రహించి, సత్యముకొరకు పాటుపడినందుకు దేశభక్తులందరును వారికి కృతజ్ఞులైయుండవలయును-

ఘోషేగారు యీవిధముగ ప్రకటించినందుకు చాలవిచారముగానున్నది. దేశమాతసేవకొరకు సర్వస్వము నర్పించి, దేశీయుల గౌరవమునకు పాత్రుడయిన యీమహనీయుడు, దూషణవాక్యములుగల యుత్తరమును ప్రకటించిన దినమునుంచియే ఆయన గౌరవనాశన ప్రారంభదినమనియే యెంచవలయును. దేశీయులందరు సత్యమును గ్రహించి నిజమయిన దేశాభిమానులను గౌరవించుచుందురుగాక !

తిలకుగారియుపన్యాసములు-

జాతీయపక్షమువారి నియమములు

తిలకుగారు,డిసెంబరు23వ తేది సాయంకాలమున బాలాజీషోగానుతెలాజరిగిన గొప్పసభలో నీవిధమును పన్యసించిరి.

కాంగ్రెసును భేదించవలయునని మనమిచ్చ టికి వచ్చియుండలేదు. ప్రత్యేకముగా మనమింకొక కాంగ్రెసును జరుపవలయుననియు వచ్చియుండలేదు. కాంగ్రెసు వెనుకంజవేయకుండజూడదలచితిమి

సమయానుకూలముగ కాంగ్రెసువారు ప్రవర్తించవలయుననియే మాకోరిక మాయభిప్రాయములను ప్రతిపక్షులు తప్పుఅర్థమును జేయుచున్నారు. నూతనోద్యమము దేశాభివృద్ధికి భంగకరమని చెప్పుచున్నారు. దేశనాశనము మాయిచ్ఛగాదు. కాంగ్రెసు ముందంజవేయునటుల ప్రయత్నించుటకు మేము తలచుచున్నాము. కాలము మారిపోయినది గాన మనప్రయత్నములుగూడ మార్పునొందవలయును.

స్వరాజ్యము మాగమ్యస్థానము. దీనిని సాధ్యమయినంతశీఘ్రకాలములో బొందితీరవలయును దీనిని మీరు తెలుసుకొనుడు. కాంగ్రెసు నెటుల

నయినను నాగపూరు తీర్మానము జరుపవలయునని యీ పురవాసులు ప్రయత్నించుచుండగా దానిని సూరతుపట్టణమునకువచ్చిన కాంగ్రెసధికారుల నిరంకుశ చర్యలను మేము యాక్షేపించుచున్నాము- కాంగ్రెసునధికారులు నిరంకుశముగ కాంగ్రెసును క్రుంగదీయ తలంపుగలవారగుటచె, బహిష్కార స్వరాజ్యతీర్మానములకు వ్యతిరేకముగనున్నారు- ప్రభుత్వమువారిఅణగద్రొక్కుచర్యలు దేశీయులందరికి అయిష్టముగానున్నను బహిష్కారవ్రతమును బహిరంగముగ బోధించుటకు వారికి ధయిర్యము చాలకున్నది- వారు స్వదేశియనుపదమును ప్రేమింతురుగాని బహిష్కారపదమును ప్రేమించరు- మీరు మీవిధిని నెరవేర్చుకొనినయెడల, భయపడవలదు పిరికివారివలె ప్రవర్తించవద్దు- స్వదేశవస్తు ప్రోత్సాహమును జేసెదమని మీరు జెప్పిన, తప్పక మీరు విదేశవస్తువులను బహిష్కరించితీరవలయును- బహిష్కారములేనిదిస్వదేశి అనా

చరణీయము. స్వదేశియొప్పుకొనినవారుబహిష్కా-
రము నొప్పుకొనవలయును. ఆచరించుటకు జేతగా
నిదానిని మీరుచెప్పవద్దు. మీరుచెప్పినది చేయు
వలయును,

మేము మనష్యులకొరకుగాని, అగ్రాసనాధి
పతి నెన్నుకొనుటకొరకుగాని పోట్లాడుటలేదు- కొ
న్ని నియమములుగల పురుషులుగావలయును- ప్రస్తు
తము మనదేశములో జరుగుచున్న జగడము రెం
డునియమములమధ్యనై యున్నది-

(1) సత్యమునినమ్మినదానిని మనస్ఫూర్తిగ జేయుము
(2) ప్రభుత్వమువారికి యయిష్టమునుగలుగునట్లు
ప్రవర్తించకుము-! నేను ప్రభుత్వమువారికి యిష్ట
మయినను, అయిష్టమయినను, మనదేశాభివృద్ధికర
మని నమ్మినదానిని నిర్భయముగ జేయవలయునని
జెప్పువాడను- మనకును, మనదేశమునకును
జేయవలసిన విధిని మనము జేసితీరవలయును- మన
విధిని నెరవేర్చుటలో, మనమేయ కాధిరమును ల

త్క్యపెట్టనవసరము లేదు- యాచించుట మాపద్ధతి గాదు యాచనవలన మనకేవిధమైన లాభము గలుగదుగాని. మనము స్వయిర్యహీనుల మగుదుము. యాచ్నాపద్ధతి మానినారుగనుకనే అనేకమంది బంగాళాచిన్న వారు కష్టముల కోర్చుకొనుచున్నారు- మనలో మనకు పోట్లాట పెట్టవలయునని ప్రభుత్వమువారు ప్రయత్నించుచున్నటుల గనుపడుచున్నది- రాజభక్తులచుట్టును చేరవలసినదని మనకు జెప్పుచున్నారు. మనమిదిచేయుదుమా? మనప్రయత్నములను వెనుకతీయుట మనయవివేకమును వెల్లడిజేయును. కలకత్తాలో దాదాభాయినౌరోజిగారు స్వరాజధ్వజములిప్పినారు ఇదిమనగమ్యస్థానము. దీనిననుసరించి ప్రవర్తించనియెడల, మనదాదాభాయిగా రేమనుకొనును? మనము దేశద్రోహులమగుదుము. స్వరాజ్యమే మనపరమావధి. ఈపరమావధినుంచి కాంగ్రెసును వెనుక తీసుకొనిపోవుటకు నెవరికిని యధికారము లేదు. కాంగ్రెసును వెనుకకు

తీసుకొనిపోయినారను నవకీర్తి మీకురాకుండ ప్రయత్నించుట మీవిధియైయున్నది. ఈప్రయత్నమునకే మీసహాయమును మేముగోరుచున్నాము. హిందూదేశీయులు స్వరాజ్యమునుబొందుట యసంభవమని మార్లేగారు జెప్పియున్నారు. ఫరంగిలక సంభవమని తోచునది. మనకు సంభవముగావచ్చును. స్వరాజ్యమే గమ్యస్థానమని సామాన్యజనులు తెలుసుకొనవలయును. మిగిలిన అధర్మములన్నియు నిందులో నిమిడియున్నవి, ప్రజలక్షేమముకొరకు, ప్రజాపరిపాలనయే స్వరాజ్యము-

రాజభక్తుల జిక్కు పెట్టవలయునని మేమిచ్చటికి వచ్చియుండలేదు- కాంగ్రెసు వెనుకకుపోకుండ జేయుటకు మేము నిశ్చయించుకొనియున్నాము భగవదానుగ్రహము వలన మనము జయమును పొందుదుము- మనపక్షము సత్యమయినది గాన, మనముజయమునుపొందుట నిశ్చయము. ఈ ప్రవాహము నాటంకపరచుట యెవరికిని శక్యముగా

ము. రాజభక్తులు బహిష్కారమను పదమునుజూచి భయపడుచున్నారు. స్వదేశి, బహిష్కారములు రెండును దేశములో నూతనజీవమును గలుగించుచున్నవి. ఆధేయరాష్ట్రాభివృద్ధికి బహిష్కారమే ముఖ్యాధారము. వలసలలోనున్న హిందూదేశీయుల దుస్థితిని మీరువినియున్నారు. వారిని ఆంగ్లేయప్రజలవలె జూచుటలేదు. మనము బానిసలవలెనుండక, ఆంగ్లేయప్రజలతో సమానమయిన హక్కులను గలిగియుండుటచే మనకోరిక. ట్రాన్సువాలులోనున్న హిందూదేశీయులమీద ప్రభుత్వమువారొకపన్నును విధించియున్నారు. అక్కడనున్నవారిలో 1300 మంది మనవారీ యక్రమశాసనమును ధిక్కరించియున్నారు. ట్రాన్సువాలులో మనదేశీయులుజూపిన యీసాహసకార్యమును మీరొప్పకొనెదరు, కాంగ్రెసువారీవిషయమై యొకతీర్మానమును జేయబోవుచున్నారు. మీరీకార్యము నొప్పకొనిన యెడల, బహిష్కారమును

మీరొప్పుకొనినటుల దోచుచున్నది. రాజభక్తులు ప్రభుత్వము వారికి యసంతుష్టి కలిగించకూడదను నభిప్రాయము లేదు. లేటులయిన నాకుయిష్టమే. వారు ప్రభుత్వము వారినిజూచి భయపడుచున్నారు అదిపౌరుషహీనమయినపని. కష్టములను ధయిర్యముతో సహించుటకు మీరుసంసిద్ధులుకానియెడల, మీరు నెమ్మదిగానుండవలయునుగాని, మమ్మును క్రిందకులాగకుడు. ప్రభుత్వములో ప్రజలకేవిధమయిన యధికారము లేనియెడల బహిష్కారము చాలయుపయోగమయిన ఆయుధము. మహాప్రయత్నములలో మీరు సహాయము జేయుటకు నేను బ్రతిమాలుచున్నాను.

ఇంతవరకు స్వరాజ్యము బహిష్కారముల విషయమై జెప్పితిని. ఇప్పుడు జాతీయవిద్యవిషయమై యుపన్యసించబోవుచున్నాను. సూరతు ఆహ్వానసంఘము వారు ఈతీర్మానమును తెమచిత్తు తీర్మానములలో నుంచలేదు, కొందరధ్యక్షుల కి

ష్టము లేనందున, ఏప్రిలునెలలో నీపట్టణమందుజరిగి న రాజధానిసభలో నీతీర్మానమును త్రోచివై చిరి. ఈతీర్మానములనుంచుట కొందరుపెద్దలయి ష్టాయిష్టములలో లేదు. సభ్యులందరి యనుమతిమీ దను నిలచియుండును. ఇప్పుడు మనకు సంభవించిన పోరాటమభివృద్ధికొరకై యున్నది. సంఘర్షణముం డనిది చలనము లేదు. ఈపోరాటములో మనము జాగ్రత్తగనుండవలయును. అందరును నొప్పుకొనక పోయినను, సభ్యులలో నెక్కువమంది యొప్పు కొనినయెడల, ఆతీర్మానమును కాంగ్రెసువారా మోదించి తీరవలయును. దానిని మార్చుటకు న గ్రాసనాధిపతిగారికిగూడ నధికారములేదు. మేమి క్కడికి దెబ్బలాటకు రాలేదు. కాంగ్రెసుని బంధ నలకు లోబడియే, మాపోరాటమును జరిగించెద ము. మేముమర్యాదగ బ్రవర్తించుటకు నిశ్చయిం చుకొనియున్నాము. అపజయముకలుగునను భయ మువలన నాప్రతిపక్షులేమి జేసినను జేయవచ్చును

విదేశ నిరంకుశ ప్రభుత్వమును నెదిరించుచున్నాము గృహనిరంకుశాధికారమును మేమెటుల సహించ గలము? ఈ కారణముననే కాంగ్రెసభ్యుల నిరంకుశాధికారమును తగ్గించుటకు మేము ప్రయత్నించుచున్నాము. కాంగ్రెసు ప్రజలందరిచే నేర్పాటు చేయబడినదిగాన, ప్రజావాక్యము కర్తవ్యము. ఏమనుష్యుడును, గొప్పవాడైనను గాకపోయినను- మరియుద్యమమును నాశనము జేయుట కేయర్హతయును లేదు- మనపరమావధినిపొందుట యసంభవముగాదు ఈపరమావధి నెప్పుడును హృదయమునందుంచుకొని మనము ప్రవర్తించవలయును- గాజభక్తులపద్ధతి నాశనకరమయినది- మీరుదాని ననుసరించవద్దు- నిరంకుశాధికారుల భయములకు మీరులొంగవద్దు ఓసూరతుపురవాసులారా! మీరు వెనుకతీయవద్దు, మీరుజయమును పొందుదురు- (వందేమాతరమ్!)

డిసెంబరు 28 వ తేదీన, అరవిందఘోషు గారి యాధిపత్యముక్రింద, ప్రస్తుతస్థితినిగూర్చి చర్చించుటకు దేశభక్తులసభయొకటిజరిగెను. అప్పుడు తిలకుగారీవిధముగ నుపన్యసించిరి- గతసంవత్సరము కలకత్తాలో పొందిన ఔన్నత్యస్థితినుంచి కాంగ్రెసును తగ్గించకూడదనువభిప్రాయముకు ప్రతినిధులచే నీసభ జరుపబడుచున్నది- కొందరు కాంగ్రెసును చెడగొట్టవలయునని చేసిన ప్రయత్నము నకుగాను ఫలితముగా కాంగ్రెసు భగ్నమయిపోయినది- నడచిన యిరువది మూడుసంవత్సరముల నుంచి, లక్షలకొలది వ్రయము జేసి జయప్రదముగ జరుపుచున్న కాంగ్రెసును, యీసంవత్సరము మన కలతలచే నాపివేయతటస్థించినది-

ఇరుపక్షముల వారి కలతకు ముఖ్యకారణము, సూరతులోకాంగ్రెసధికారులు గొందరు, కాంగ్రెసును రాజభక్తులసభగా మార్చవలయు

నని ప్రయత్నించుటయే యైయున్నది- ఈదుష్ప్ర యత్నము నాటంకపెట్టుటకే గడచిన కొద్దిదినము లనుంచి దేశభక్తులు పోరాడుచున్నారు- లజపుత రాయిగారి నెన్నుకొనిన ప్రభుత్వమువారికి కోపము వచ్చుననియు, అందువలన వారు మనయుద్యమము ను పాడుజేయుదురనియు, సూరతు ఆహ్వానసంఘ మువారు లాలాగారి హక్కులను త్రోసివైచిరి- కాంగ్రెసంతమునకు, యదియే ప్రారంభమయియు న్నది. కాంగ్రెసధికారమునంతయు సంగ్రహించు టకును, ప్రభుత్వమువారి యిచ్ఛానుకూలముగ మ నకు యాదర్శములను మార్గములను గనుపర చుటకును మనమంగీకరించకుండిన, కొందరు నిరం కుశాధికారులు దేశీయమహాజనసభను ఒకపక్షము వారి కనుకూలముగ జేయుటకు బ్రయత్నించనివా రయి యుందురు, ప్రభుత్వమువారి కేవిధమయిన యభ్యంతరము లేని తీర్మానములను జేయనిశ్చ యించిరి. ప్రభుత్వమువారు మనయుద్యమము నణ

గ్రోకలే ప్రయత్నించుచుండ, మనము కొంతహద్దు ను దాటిపోకూడదని కొందరభిప్రాయముగానున్న రు. మరికొందరు రాజుల యణగద్రొక్కు చర్యలే, మనభావ్యభివృద్ధికి కారణభూతములగునని దలచుచున్నారు. ఫరంగీసహాయమువలననే మనమభివృద్ధి నొందవలయునని యొకపక్షమువారును, అటులగాదని రెండవపక్షమువారును జెప్పుచున్నారు. రెండవ పక్షమువారి యభిప్రాయమే ప్రజాయంగీకారమును బడయుచున్నది. ఉభయపక్షములవారికిని పోరాటము సంభవించినను, ఇంతవరకు నయికమత్యముతో ప్రవర్తించిరి. ఈసంవత్సరము స్టేటు సెక్రటరి గారికిని, మరికొందరు ఫరంగీలకును రుచించ లేదని కలకత్తా కాంగ్రెసువారు జేసిన స్వరాజ్యము, బహిష్కారము జాతీయవిద్య, స్వదేశీతీర్మానములను వెనుకకుద్రోయ ప్రయత్నించిరి, దేశీయులందరును, నిది తమకవమానమని తలచిరి. కాంగ్రెసును వెనుకకుద్రోయుట కెవరికిని యధికారము లే

డు. ప్రభుత్వమువారి యయిష్టమునకు పాత్రము
గాకుండ చేయవలయునని బొంబాయిరాజభక్తులు
కాంగ్రెసును వెనుకకు దీసికొనిపోవ ప్రయత్నించిరి

పయిజెప్పిన తీర్మానములను మార్చవల
యునని రాజభక్తులు పట్టుపట్టినందువలననే, దేశ
భక్తులు ఘోషుగారి నగ్రాసనాధిపతిగ నెన్నుకొను
విషయము నాటంకపరచిరి. దేశీయులందరు లజపతి
రాయిగారిని నెన్నుకొనవలసినదిగా ఘోషించుచు
న్నను, ఘోషుగార గ్రాసనాధిపతిగనుండుటకు స్థిర
మయినపుడు, దీని నెదిరించుట తమవిధియని దేశభ
క్తులు దలచిరి. గడచిన సంవత్సరములలోవలె, యి
రుపక్షములవారి కనుకూలముగ నన్ని విషయముల
ను నేర్పాటుజేయవలసియుండెను, బొంబాయిరా
జభక్తులు దేశభక్తులను ద్రోసివేయ నిశ్చయించు
కొనినందున, నిరుపక్షముల వారికిని సంధియసంభవ
మాయెను, దేశభక్తులు సంధిజేసికొనుట కనే
కవిధముల ప్రయత్నించినను లాభములేకపోయెను,

ఇప్పుడు కలిగిన కాంగ్రెసు భగ్నము చిరకాలముండ దని నేను దలచెదను. ఈభగ్నమునకై నావలె చింతించువా రెవరును నుండరు. ప్రభుత్వమువారు దమ జుట్టును జేరవలసినదిగా రాజభక్తుల ప్రోద్బలము చేయుచున్నారు. ప్రతివిద్యాధికుడును ఫరంగీమోసపు మాటలకు లొంగకుండుటకు బ్రయత్నించవలయును, ఈభగ్నమువలన కాంగ్రెసు నిరంకుశాధికారులకు జయముగలిగినది. దేశభక్తులను ద్రోసివేయవలయునను నీనూతనప్రయత్నము దేశాభివృద్ధికి భంగకరము.

ఉభయపక్షముల వారును నయికమత్యము తో బ్రవర్తించుట యసంభవమని తెలిసినప్పుడు దేశాధ్యక్షులందరుగూడి యన్నివిషయములను స్థిరపరచియుండవలసినది. అందువలననే నేను ఆగ్రాసనాధిపతి నెన్నుకొనువిషయము నా పుడల జేసి యుభయపక్షములవారి యభిప్రాయభేదములను స్థిరప

రచుటకుఒకకమిటినేర్పరచవలసినదిగాగోరియుంటి ని. కాంగ్రెసు వేదికపైకివచ్చి నేను సూచించద లచిన విషయము నిదియే- మేమనేకులము సంధి చే యుటకు బ్రయత్నించితిమిగాని మా ప్రయత్నము లన్నియు నిష్ఫలమయ్యెను. బొంబాయిరాజభక్తు లేవిధముగనయినను దేశభక్తులను త్రోసివేయవల యునను నభిప్రాయమే ప్రస్తుతదుస్థితికి కారణము

దేశభక్తులు ఓర్పుతో పనిజేసియుండవల సినదని కొందరు చెప్పుచున్నారు. ఇదినిశ్చయమే గాని, ఓర్పునకు గొంతమితియున్నది. దేశభక్తులు కాంగ్రెసును వెనుకకు పోనిత్తురా? దీనికి ఫలితము కాంగ్రెసు భగ్నమయిపోవుటయే- ఈభగ్నము వ లన నుభయపక్షములవారును బలహీనులయిరి-

కాంగ్రెసును సాగించుటకు దేశభక్తులు కొ న్ని యేర్పాటులు జేయవలసియున్నది- మనము క లకత్తా కాంగ్రెసు తీర్మానములనను సరించి ప్రవ ర్తించవలయును, ప్రభుత్వమువారిని సంతోషపె

ట్టవలయుననిన, మనము వెనుకకు పోవచ్చునుగాని, మనము దేశహితమును గోరినయెడల నటుల జేయు టమంచిదిగాదు- గవర్నమెంటువారిని సంతోషపె ట్టుటకు బ్రయత్నించుటకంటె వారి యణగద్రొక్కు చర్యలను నెదిరించు కాలమువచ్చినది- మనదేశము లో ప్రజ్వరిల్లిన నూతనజ్వాల నారిపోకుండ జేయుట కు దేశభక్తులు సమస్తవిధముల పాటుబడవలయును

దేశభక్తు లేమి జేయవలయును? 30 లేక 50 మంది సభ్యులుగాగల నొకకమిటి నేర్పాటుచేయ వలయును. ఈకమిటివారిప్పటి కాంగ్రెసుభగ్నము యొక్క ఫలితములను బాగుగ గనిపెట్టి, ముందు యేవిధముగ బ్రవర్తించవలసినది యేర్పాటులు చేయును. ఈకమిటివారు పక్షపాతమువహించక స్థితిగతులను బాగుగ తెలిసి అన్ని యేర్పాటుల ను చేయుటకు బూనుకొనవలయును. ఉభయపక్ష ములవారును శీఘ్రకాలములో మరల నయికమత్య ముగలవారై యొకచోటగూడి, స్వరాజ్యమునుపొం దుటకు బ్రయత్నించుదురుగాక ?

(వందేమాతరం)

## ఎవరు యక్రమముగ ప్రవర్తించిరి?

మనమింతవరకు యుభయపక్షముల వారి యభిప్రాయములను తెలుసుకొనగలిగితిమి. వెనుకటి విషయములను బాగుగ విచారించి, యొకపక్షము నవలంభించక యెవరియక్రమ ప్రవర్తనవలన కాంగ్రెసు భగ్నమయినదో మనమిప్పుడు సిద్ధాంతీకరించవలసియున్నది. తిలకుగారి పక్షమువలనే కాంగ్రెసు భగ్నమునకు కారణమని ప్రతిపక్షులనేకమంది యభిప్రాయపడుచున్నారు. కాంగ్రెసభికారుల నిరంకుశప్రవర్తనయే యన్నివిఘాతములకు మూలకారణమని తిలకీయులు ప్రకటించుచున్నారు. ఈయుభయుల యభిప్రాయములను యవతలనునిచి, కాంగ్రెసుదినమున జరిగిన సంగతులను ప్రథమమున విమర్శించిచూతము. 27 వ తేదిన ఆహ్వానసంఘాధ్యక్షుడయిన మాలవీగారు కాంగ్రెసుపందిరి ప్రవేశించుచుండగా, తిలకుగారు యొకయుత్తరమును వారిచేతికిచ్చిరి. సభప్రారంభింపకపూర్వమే, వారా

యుత్తరమును చదువుకొని సంగతులను గ్రహించిరి. ఆయుత్తరములో కాంగ్రెసు నాపివేయవలయుననియు, అగ్రాసనాధిపతి నెన్నుకొను విషయమును గూర్చి వారుకొంత సభికులకు యుపన్యసించుటకనుమతి యివ్వవలసినదనియు యున్నట్టుల యందరును వప్పుకొనిన సంగతియొద్దెయున్నది. బానర్జీ గారుపన్యసించుచుండగా తిలకుగారు తమయుత్తరమునకు జవాబివ్వవలసినదిగా మాలవీగారికి మరల యొకచీటిని బంపిరి. గాని, తిలకుగారికేవిధమైన ప్రత్యుత్తరమును వచ్చియుండలేదు. తిలకుగారు వేదికపైనెక్కినపుడు యగ్రాసనాధిపతిగారి నెన్నుకొను విషయము పరిష్కారముగా లేదు. ఆసమయమున, తిలకుగారికిని, మాలవీ ఘోషుగార్లకును యొకగొప్పసంభాషణ జరిగియుండెను.. వెంటనే కాంగ్రెసు నిరకులేకయే యాపివేయబడినదని పందిరిలో గొప్పసంక్షోభము బయలుదేరెను. మనమిప్పుడు జ్ఞాపకముంచుకొనవలసినసంగతి తిలకుగా

రి చీ విషయమై సభికులకు మాలవీగారు తెలియ
పరచియుండలేదు. తిలకుగారు సభికులకుపన్యసిం
చుట కవకాశము లేదని బహిరంగముగ సభలో
జెప్పియుండలేదు. తిలకుగారి ప్రార్థనలు క్రమ
మయినను గాకున్నను, మాలవీగారుగాని ఘోషు
గారు గాని, తమయిష్టప్రాయములననుసరించి యొకప
క్షమునకనుకూలముగ ప్రవర్తించుటకు యధికారము
లేదని వారుగుర్తెరిగియుండవలసినది. వారు అ
గ్రాసనాధిపతిగానుండుట, సభికులయనుజ్ఞ ననుస
రించి నడువవలసినదేగాని, నిరంకుశముగ వారియి
ష్టప్రకారము వర్తించుట సభానియమములకు విరు
ద్ధముగానున్నది.

తిలకుగారియుత్తరమును సభ్యులకు వినిపిం
చి వారియనుజ్ఞ ననుసరించి వర్తించియుండిన,
కాంగ్రెసధికారులు నెవరును దూషించియుండియుం

డను. వారటుల జేయక, సభ్యుల కేమియు తెలియజే యకయే, తిలకుగారు మాట్లాడగూడదని రహస్య ముగ వారికిజెప్పిరి, బానర్జీగారి యుపన్యాసమయి వతరువాత, తమయభిప్రాయములను వెల్లడిజేయు టకు వేదికపైనెక్కుటవలన తిలకుగారు సభానియ మములకు వ్యతిరేకముగ ప్రవర్తించలేదని జెప్ప వచ్చును, కాంగ్రెసు నాపి వేయవలయుననియు, స భ్యులకుపన్యసించుటకు యనుమతి యివ్వవలసినద నియు తిలకుగారుకోరుట క్రమమయినదో కాదో మనమిప్పుడు విచారించవలసియున్నది. సామాన్య ముగా చర్చాసంఘనియమముల ప్రకారము, సభ లో చర్చజరుగుచుండగా సభ నాపివేయవలయున ని సూచించుటకు సభ్యులలో నెవరికయినను యధి కారముగలదు. ఈసూచనను సభవారందరు యం గీకరించిన, సభ నాపి వేయవలయును. గాని సభవా రికి తెలియజేయకయే యగ్రాసనాధిపతిగారు తమ యిష్టప్రకారము, యీసూచన నంగీకరించుటకును

లేకుండుటకును, యేవిధమునైన యధికారమును లే దు. సభపనులను యూపుదలజేయుటకు జేయుసూ చనలన్నిటిని సభవారు తమరు యాలోచించుచున్న విషయము నాపివైచి, ప్రథమమున విచారించవల యును. పార్లిమెంటరీ ప్రాక్టీస్ యనుగ్రంథములో సర్ యర్స్కిన్ మేదొరవారు చర్చనుచ్ఛ్వను యే స భికుడయినను సభపనుల నాపుదలవిషయమై సూ చించిన సభవారు ముందుగ దానినాలోచించి. త రువాత వారిపనినివారు జూచుకొనవలయునని వ్రా యుచున్నారు. బొంబాయి యూనివర్సిటీ యొక్క యు, మ్యునిసిపల్ కార్పొరేషను యొక్కయు చట్ట ములప్రకారము, సభజరుగుచుండగా, చర్చవిష యముల నాపుదలచేయుటకుగాని, సభనే యాపు దలజేయుటకుగాని యేసభికుడయినను సూచించవ చ్చును. సభనాపివేయుటకుగాని, చర్చవిషయముల నాపుదలకుగా

ని జేయుసూచనను సభవారు ప్రథమమున యాలోచించవలయునని మ్యునిసిపల్ కార్పొరేషను నియమములలో స్పష్టముగాయున్నది. సభానియమములను పాటిజేయకయే, తనయిష్టమువచ్చినటుల తిలకుగారి ప్రార్థనలను త్రోసివైచి, తిలకుగారేయక్రమముగ ప్రవర్తించిరని జెప్పటకు ఘోషుగారెట్టుల సాహసించిరో మేమూహించజాలకున్నాము. సరియయిన కారణములేని తిలకుగారి యుత్తరమునకు జవాబియ్యలేదు. వారిచీటీవిషయమై సభికులకు తెలియజేయలేదు. సభవారుగల విషయములో కొంతవిచారణయున్నదని జెప్పలేదు. తామంతట తామే సర్వాధికారమునువహించి, తిలకుగారు పన్యసించగూడదని యాజ్ఞాపించిరి.

అగ్రాసనాధిపతి చర్చను క్రమపరచవచ్చును. చర్చను ముగించుటకు సూచనకనుమతియివ్వవచ్చును. లేకతానే——————చర్చను ముగించ

వచ్చును. గాని, చర్చ జరుగుచుండగా యేసమ యమునందయినను సభ నాపుదలవిషయమయి యె వరయినను సూచించదలచిన, వానినాటంకపరచు ట కేవిధమయిన యధికారమును లేదు. యేసభి కునయినను మాట్లాడనిచ్చుటకును వద్దనుటకును సభ్యులందరును స్థిరపరచవలయునేగాని అగ్రాసనాధి పతిగారు స్వేచ్ఛగా ప్రవర్తించవీలులేదు. సభికుల లెవా రెవరయినను మాట్లాడదలచినచో, యెక్కు వమంది వలదనుచున్నను, యగ్రాసనాధిపతి వాని నిపక్షీకరించి, సభ్యులు వానినిమాట్లాడుట కనుజ్ఞ యిచ్చుటకు ప్రయత్నించవలయును. రాసవిహారి ఘోషుగారును మాలవీగారును తమకు ప్రజలచే నొసంగబడిన గొప్పపదవికి తగినట్లుగ ప్రవర్తించ క, సభానియమములు దెలియని మూఢులవలె ప్ర వర్తించుట యెంతయు వింతగానున్నది. తిలకుగా రు తాను గొన్ని సంగతులను సభవారికి సూచించవ లయునని చెప్పినప్పుడు కొంచెము సేపాగమని చెప్పక

సభ్యులకు దెలియజేయకయే మాట్లాడుటకు వీలు లేదనియు. తమస్థానమునకు వెళ్ళి కూర్చొనవలసిన దనియు యాజ్ఞాపించసాగిరి. సభ్యులందరును తిలకు గారిసూచనకు వ్యతిరేకముగానున్నారని జెప్పుట వలనలాభము లేదు. వారి ప్రార్థనలను సభ్యులకు వెల్లడిజేసియుండినయెడల, వారి యభిప్రాయముల ను వినుటకు సభవారంగీకరించి యుండవచ్చును. ఆగ్రాసనాధిపతిగారు యక్రమముగ ప్రవర్తించినం దువలననే తిలకుగారు తామంతటతామే సభ్యులకు తమకోరికలను బలవంతముగ తెలియజేయుటకు ప్ర యత్నించవలసివచ్చినది. ఇటులజేయుట క్రమమో కాదో, పార్లమెంటుయాచారములను విచారించి న మనకు తేటపడగలదు. పార్లమెంటులో సభికు లకు చాలనధికారముగలదు- సభలోజరుగు విష యములన్నియు సభికుల యనుమతిమీదనే నిలచి యుండును. లాడుల్సు మహాసభలో సభాధిపతియ ధికారమునకు పరిమితిగలదు- ఏసభికునయినను

మాట్లాడనిచ్చుటకును వలదనుటకును సభిక
ల యిష్టాయిష్టములననుసరించే యుండును. ఎప్పుడ
యినను యిద్దరు ఒకపర్యాయమే మాట్లాడుటకు
నిలువబడిన యెడల యాయిద్దరిలో నొకరిని మాట్లా
డుటకు నియమించుటకు, సభికుల యనుజ్ఞపడసి
యగ్రాసనాధిపతిగారు ప్రవర్తించవలయును. మా
లవీఘోషుగారలు యీవిషయముల నన్నిటిని మన
సునందుంచి తమరొకపక్షమును జేరియున్నందున
తమయభిప్రాయములననుసరించిప్రవర్తించక, సభికు
ల యనుమతిమీద పనులు జరుపుట యెంతయావ
శ్యకమో చదువరులే యూహించగలరు. అగ్రా
సనాధిపతిగారి నెన్నిక వి
షయమై పత్రికలలో కాంగ్రెసుజరుగుటకొక నె
లదినములనుంచి చర్చజరుగుచుండెను. దేశభక్తు
లు కాంగ్రెసులోనా యగ్రాసనాధిపతిగారి నెన్నుకొను
నువిషయమునుగురించియు తమవ్యతిరేకాభిప్రాయ
మును తెలియపరచుచుండగను సంగతి మాలవీ ఘోషు

గారలకు దెలియును దేశభక్తులసభ లైనా యీవి
షయము స్పష్టముగ తీర్మానించబడినది సభకుసు
మారు 700 మంది దేశభక్తులువచ్చియుండిరి దేశభ
క్తులనుస్వయముగ ద్వేషించినను వారిసూచనలను
త్రోసివైచుటకు యత్నించుటయవివేకము, అ
గ్రాసనాధిపతిగారి నెన్నుకొను విషయమును కాం
గ్రెసుతీర్మానముల విషయమును దేశభక్తులు దేశ
మంతటను యాందోళన జేయుటయేగాక తిలకు
గారియుత్తరముగూడ కాంగ్రెసధికారులకు జేరి
యుండెను- వారాయుత్తరము నెంతమాత్రమునుల
క్ష్యము జేసియుండ లేదు- సభికులకీవిషయము తెలియ
జేయ లేదు- తిలకుగారికి ప్రత్యుత్తరమును వ్రాయ
లేదు- ఇట్టిసందర్భము లైనా తిలకుగారు
జేసిన తప్పిదము నాకతమస్థానమును వదలి, స
భ్యుల నుపన్యసించుటకు వేదికపయి నెక్కుట
యేనాయునున్నది ఘోషుగారు సభానియ
మములను త్రోసివైచినిరంకుశముగ ప్రవర్తిం

చినందువలననె తిలకీయులు తమహక్కులను నెలకొల్పుటకు ప్రయత్నించిరి ఇంగ్లండు నుంచివచ్చిన నెవిన్సన్ దొరవారు యగ్రాసనాధిపతిగారు కొంచెమోర్పు గలిగియుండిన కాంగ్రెసుభగ్నముగాకుండియుండుననని వ్రాయుచున్నారు సూరతులో జరిగినఅన్నియల్లరులకును విఘాతములకును మాలవీ ఘోషుగార్లెయుత్తరవాదులు తిలకుగారు తమస్వాభావికహక్కులను నిలుపుకొనుటకును కాంగ్రెసధికారుల నిరంకుశ చర్యలనణగద్రొక్కుటకును ప్రయత్నించిరి.

## అలహాబాదు మాడరేటుసభ.

సూరతులో కాంగ్రెసుభగ్నమయినమరుసటి దినము రాజభక్తులందరును గలసి యొకసభ జేసిరి. ఆసభనేర్పరచినవారు కొన్నిషరతుల పెట్టి వాటినంగీకరించినటుల సంతకముల చేసినవారినే సభకు రానిచ్చిరి. దేశహితమును గోరు యనేకమంది

కీషరతుల నొప్పుకొనుటకు యిష్టములేనివారై, యీసభకు వెళ్ళరయిరి. మెహతా, ఘోక్లే మొదలుగాగల కొందరి యాజమాన్యముక్రింద యీసభ జరిగెను. దేశీయమహాజనసభ జయప్రదముగ జరుగుటకు కొన్ని నియమముల నేర్పరచుటకును యీ సభ పరమావధిని వ్యక్తీకరించుటకును అలహాబాదులో మాచిని నెలలో యొకసభ జరుపుటకు తీర్మానించబడెను. ఈతీర్మానప్రకారము మాచినెలలో అలహాబాదులో సభజరిగెను. ఈసభలో కాంగ్రెసు నేపద్ధతులమీద జరుపవలయునో, యెవరు కాంగ్రెసు ప్రతినిధులు కావచ్చునో స్పష్టము చేయబడినది, ఆంగ్లేయరాజ్యములోనుండు యితర దేశములవారనుభవించుచున్న స్వరాజ్యమువంటి స్వరాజ్యమును పొందుటయే పరమావధియనియు ప్రస్తుతఆంగ్లేయ కట్టుబాటుకు లోబడియే దీనిని పొందప్రయత్నించవలయుననియు యీసభవారు తీర్మానించిరి- ఇదియునుగాక ఈక్రిందిషరతుల నొ

ప్పుకొనినవారే కాంగ్రెసు ప్రతినిధులుగ నుండవల యుననిగూడ తీర్మానములు చేయబడెను- 1 కన్వె న్షన్ కమిటివారేపఱచిన కాంగ్రెసునియమముల కును పద్ధతులకును బద్ధుడనగుచున్నాను-. 2 కాం గ్రెసుపరమావధులను పొందుటకు జరుపు సభలన్ని టిలోను రాజనీతి, సభాధికారుల నియమములను ధి క్కరించక ప్రవర్తించుట కొప్పుకొనుచున్నాను.

ఈవిధములగు షరతులు రహస్యపు సంఘము వారు చేసుకొనుట యాచారమునున్నది- గాని కాంగ్రెసుసభవారు యావరులచే ప్రతినిధులను బద్ధులనుచేయుట కే కారణమును లేదు- కేన డా మొదలుగాగల దేశములవారు పొందినటువంటి స్వరాజ్యమును పొందవలయునని కాంగ్రెసు నాయ కుల యభిప్రాయము. అనేకయలంకారములచే గా డిదను గుఱ్ఱముగామార్చగలగినయెడల హిందూ దేశములోనున్న ప్రస్తుతనిరంకుశ ప్రభుత్వమును ప్రజాపాలకముగా మార్చగలుగుదురు- మూడ రే

టు పక్షమువారు యూనియనుముల నుపకరించుటకు ముఖ్యోద్దేశము దేశభక్తుల నవతల ద్రోయునల యున్నతో నెంచవలయును. కాంగ్రెసు ప్రతినిధుల కేమాత్రమును స్వాతంత్ర్యమును లేక, ఒకరిద్దరి యభిప్రాయములననుసరించి దేశీయులందరు యూనియనములకు లొంబడుదురా? లొంబడరనియే చెప్పవలయును. గనుక కాంగ్రెసుకు దేశీయులందరు ప్రతినిధులుగాక, కొందరు మాడరేటు పక్షమువారే ప్రతినిధులుగవచ్చుట సంభవించును. ఈ కారణమున ముందుజరుగబోవుసభను దేశీయమహాజనసభ యనిపిలుచుటకు వీలులేదు. మాడరేట్లు కాంగ్రెసు హత్యగావించిరి.

వందేమాతరం.

PRINTED AT THE DESABHIMANI PRESS,
GUNTUR.

# ప్రకటన

ఈపుస్తకము వలయువారు

మేనేజరు, దేశాభిమాని ముద్రాక్షరశాల

గుంటూరు.

అని వ్రాయవలయును.